సశాస్త్రీయముగా తయారు చేయబడి, గుణవంతముగా నున్నవని అనుభవపూర్వకముగా నిర్ణయము చేయబడిన—

# ఆయుర్వేద ఔషధములు

1. ద్రాక్షా—అయోటోన్: పౌను 1కి రు2-8-0
పాండువు, అగ్నిమాంద్యము, విరేచనబద్ధకము బలహీనత మొదలగు వ్యాధులమీద పనిచేయును.

2. టమోటోన్: పౌను 1కి రు5-0-0
జీవాణువుయుక్తమైనది. రక్తహీనత, దుర్బలము నిర్వీర్యత మొదలగువాటిని నిర్మూలించును.

3. కాసహర: పౌను 1కి రు4-0-0
తియ్యని రసాయనము. దగ్గు, ఒగర్పు, మొదలగు శ్వాసకోశ వ్యాధులను నివారించును.

4. యష్టి—కాంపౌండుపొడరు: పౌను1కి రు5-0-0
దగ్గు, ఒగర్పు, గొంతునొప్పి, అజీర్ణము మొదలగు వాటిమీద అద్భుతముగా పనిచేయును.

* ఖర్చులు ప్రత్యేకము. వ్యాపారస్తులకు కమీషను యివ్వబడును.

☞ వినయాశ్రమము (వయా) పొన్నూరు, గుంటూరుజిల్లా అని వ్రాయవలెను.

# త్యాగమహిమ



రెండవకూర్పు ౧౦౦౦ ప్రతులు.

వినయాశ్రమ ప్రచురణ.

1947

# రెండవకూర్పుకు తొలిపలుకు

గీతమాలిక. "ఆదినుండి నేటిదనుకనమరియుందు। ముందుముందిక నెన్నఁడో మరియగిలుగు। భూత సృజనంబు నానొప్పు భూరుహంపు। పూర్ణపరిపాక సుకుమార పుష్పమీవ॥(2)ఆ మహాకల్ప వృక్షంపు అనంత తపము। పండివెలువడు సౌజన్య ఫలమవీవ। తత్ఫలము పక్వమై రసధారలొలుకు। ధర్మసంబోధ నామృతధారవీవ॥ (3) పావన తమ సంపూర్ణ సౌభాగ్యమీవ। భావనాతీత పూర్ణత్వ పర్వమీవ। ధన్యమగు నార్యజాతి కాదర్శమీవ। సృష్టి తరియించు కారుణ్య సీమవీవ। ప్రాణికోటి దన్పెడు మైత్రివర్షమీవ। విశ్వహృదయంపు మర్మ సంవేదివీవ। గుప్తధర్మంబు ప్రకటించు గురుడవీవ। ధన్య నిర్వాణ సన్మార్గ దర్శివీవ। స్వార్థ రాహిత్య నిరుపమ స్వచ్ఛసేవ। మోక్షమూలంబు జూపుముముక్షువీవ। తల్లిదండ్రి, ధనము, ధాత్రి, తరుణి,తనయు। అఖిలరాజ్యంబు త్యజియించు త్యాగివీవ। మానవోత్తమ రాజన్యమకుటమీవ। తత్కిరీట దేదీప్య రత్నంబవీవ। సదమలాహింస బోధనా చార్యుడీవ॥ (4) క్రిమి జలచరము లురగ ములు కీటకములు। పక్షి పశువులు నరులు దేవ

తలు పరులు! అంతరాత్మ, జీవంబు, దేహంబు, జడము! బాహ్యాభూత ప్రపంచంబు వశ్యమొంద పూర్ణమానవ్వేచ్ఛనొసగినపూజ్యుడివి॥ (౫)తర మొకటి దాటి విద్యార్థి దశనునన్ను! మనసు మెప్పించి పిల్చిన మాన్యుడివి! మరలనాహ్వానమంపెడి మంత్రి వీవా! కీలుబొమ్మనుచేసి ని కేలనన్ను! ఉద్ధరిం పంగ పూనెదో బుద్ధదేవ॥

ఇట్లు కడలూరు కారాగృహములోనుండగా 28-6-32 జ్యేష్ఠ బ॥ ౧౩ జయవారము బుద్ధ దేవుని స్మరణ పద్యరూపమున స్ఫురించె. విడుదల అయిన పిమ్మట నాస్నేహితుడు శ్రీ చంద్రికాళి చిదంబర రావుగారికి దానిని చూపించితిని. వారు సూచించిన సవరణలతో, పైరూపమును నా భావములు దాల్చుచున్నవి. నాటి బుద్ధదేవుడే నేటి మహాత్ముడు అనునమ్మకము కలిగి రాజకీయ రంగమున అడుగిడుటయు, నిర్మాణకార్య పుణ్య క్షేత్రమున ఒదిగి యుండుటయు, దాని ప్రభావములే. ఆ కారాగృహములో నాతో సహవాసిగా నుండిన శ్రీ పారుపూడి సత్యనారాయణ గారును, వారి కుమారుడు రామమోహన రావు గారును, చేసిన కృషివలన బౌద్ధ వేదములగు వినయ పిటకగ్రంథములు, మూడునుకాకినా

శాంతి క్షేత్రములో నుండగనే నాకు లభించెను. ఆ గ్రంథములు చదువగా వానిలోని కథలను ఆంధ్రులకు తెలిపింప కోరికపొడమెను. వానిలో ముఖ్యమైన 13 కథలను యేరితిని. నేను చెప్పుచుండగా నా చిరకాలమిత్రుడు, బ్రాహ్మణకోడూరు వాస్తవ్యులు శ్రీ॥ శ్రీ॥ రామినేని అప్పయ్యగారు వ్రాయుచుండిరి. భావము 'ఆత్మ'. భాష దానికి 'శరీరము'. వ్యాకరణాదులు ఆ శరీరమునకు సంస్కారములు. రుచిగల రూపమును రచించ ప్రయత్నింపలేదు. కావూరులో బుద్ధభగవానుని జయంతి 8-5-1933న జాతి జయ స్తంభము నాటబడిన శుభసమయమున దీని మొదటికూర్పు, వెలువడుట అదృష్టముగా భావించితిని.

ఆ గ్రంథ విక్రయమువలన వచ్చెడి ధనమును దేశసేవకై వినియోగింపబడునని అప్పటి తొలిపలుకులో చెప్పిన వచనము సార్థకమయ్యెను. తదనంతరము 23-12-33న స్థాపింపబడిన వినయాశ్రమము ఆ గ్రంథమునకు హక్కుదారయ్యెను. 14 ఏండ్లు గడచిన పిమ్మట, ఇపుడు రెండవకూర్పు వెలువడుచున్నది. అప్పుడే చిత్తులలో వ్రాసి వుంచిన గుర్తులనుబట్టి ఉదయనుని కథ ఇపుడిందులో 14వ కథగా చేర్చబడెను. అపుడు 'టిట

## విషయసూచిక

# త్యాగమహిమ



## —॥ యాసునికథ ॥—



గౌతమబుద్ధుడు కాశీపట్టణమునందు తన ధర్మమును బోధించెడికాలములో, ఆనగరపు ముఖ్యశ్రేష్ఠికి యాసుడను ఒక కుమారుడు గలడు. అతనికి వేసవికి ఒక రాజమందిరమును, వానకాలమునకు ఒక రాజమందిరమును, చలికాలమునకు యింకొక రాజమందిరమును ఉండెను. అతడు ఒక్కొక్కదానిలో నాలుగునెలలు గడుపుచుండెను. ఆటకత్తెలును, పాటకత్తెలును, సేవకులును, దాసీలును, అతని కనుసైగల మెలగుచుండిరి. అతడు యౌవనవంతుడును, బలవంతుడును, అయి పంచేంద్రియముల మూలమున పెక్కుసుఖముల బడయుచుండెను. సౌందర్యవతియగు భార్యతో సంసారము చేయుచుండెను. ధనధాన్యసంపదలకు కొదువలేకుండెను. ప్రేమవంతులైన తలిదండ్రులు కనురెప్పలవలె వానిని కాచుచుండిరి.

వానకాలమున, ఒకనాడు ఆయన పెందలకడ

నిదుర లేచెను. పరివారమంతయు యింకను నిద్రించు చుండెను. మేడమీద తంబురతో నొకతె, చంకపై వీణతో నింకొకతె, మద్దెలపై చేతితో మరి యొకతె, కొప్పువీడి చిక్కువడిన వెంట్రుకలతో నింకొకతె, నోటినుండి కారెడు చొంగతో మరియొ కతె—పలువురు పలువిధముల పడియుండిరి. అంద రును నిదురలో గొణుగుచుండిరి. ఆచోటంతయు శ్మశానము వలె అతనికి కనుబడెను. సంసారసుఖ ములలోని దోషముల నతను కనిపెట్టెను. మన సులో విసుగుపుట్టెను. అయ్యో, యెంత ఆపద! యెంత దుఃఖము! అని చింతించుచుండెను.

బంగారు పోతబోసిన చెప్పులు దొడుగు కొని మేడవాకిలి వద్దకు వచ్చెను. మానవులుగా నట్టి వ్యక్తులు ఆవాకిలి తెరచిరి. కొంతదూరము నడచి నగరము బైటగుమ్మము వద్దకుచేరెను. ఆ వాకిలియుఅట్లే తెరువబడియుండ దానిగుండబయలు వెడలి యీ యువకుడు తెల్లతోటయనుచోటికి వచ్చెను. అప్పుడు బుద్ధభగవానుడు బైటగాలిలో ఇటునటు పచారిచేయుచుండెను. ఈ యాసుని చూచి ఒకచోటపీటపై ఆయన కూరుచుండిరి. అయ్యో! యెంతదుఃఖము! యెంత ఆపద యనుచు యాసుడు పలువరించుచుండ భగవానుడాతనితో

నిట్లనియెను, "ఇచ్చట దుఃఖములేదు. ఇచ్చట ఆపదయులేదు.యూసా, ఇటురమ్ము. కూర్చుండుము. నేను నీకుధర్మమును బోధించెదను."

ఆమాటలు వినగానే యూసుని చింతదీరెను. సంతోషము కలిగెను. చెప్పులు విడిచి, బుద్ధుని సమీపించి, భక్తితో నమస్కరించి, కూర్చుండెను. ఆతనికి, దానముచేయుట వలన కలుగు ఫలమును, ధర్మవిధులును, స్వర్గమును, కోరికలలోని చెడుగును, పాపమును, కోరికలు విడుచుటవలన దొరకెడు సౌఖ్యమును-అనగా నిష్కామకర్మవల్ల కలుగు మేలును బుద్ధుడు బోధించెను. ఆయన మనసులోని అడ్డంకులుతీరి మెత్తబడి ఉత్సాహము కలిగి, ఉత్తమబోధకు అనుకూలముగా నుండువేళ. బుద్ధుడు తన ముఖ్య ధర్మములను బోధించెను. నల్లమచ్చలు లేని తెల్లబట్టకు తేలికగా రంగుపట్టినట్లు, యూసుని జ్ఞాననేత్రము తెరువబడి ధర్మరహస్యమునుజూచెను. పుట్టుచద్దెల్లను గిట్టకతప్పదని అతనికి స్పష్టమయ్యెను.

ఇటివద్ద యూసునితల్లి యూసునిగానంచక మేడలలో వెతికించి, పెనిమిటితో ఆసంగతిచెప్పెను. అతడును నలుదెసలకు గుఱ్ఱపురౌతుల బంపెను, తాను స్వయముగా లేళ్ళతోటన్నవైపుకు బయలుదేరి కుమారుని బంగరు చెప్పులజాడలను ఆనవాలుబట్టి

ఆతోఁవనే చని చని బుద్ధుని గాంచెను. “ప్రభో! యేసుని జూచితిరా?” అని అడిగెను. “శ్రేష్టి! ఇచ్చటనే నీవు యేసుని చూడగలవు. కూర్చుండుము.” అని బుద్ధుడు జవాబుచెప్ప, ఆగృహస్థుడు సంతసముతో ఉప్పొంగి బుద్ధునికి వందనముచేసి చెంత కూర్చుండెను. ఆతనికికూడ బుద్ధుడు యథా ప్రకారము బోధించెను. బుద్ధుడు అనేక ఉపమానములతో దుర్వ్యయము, దుష్టస్వభావము, చాపల్యము, అన్నవస్త్రముల విషయములో ఎన్నటికిని తృప్తిపొందకుండుట, జనులమధ్యనే కాలము గడుపుట, సోమరితనము–అను యీ చెడుగుణములను ఖండించెను. పొదుపు, సుశీలము, మితము, తృప్తి, పాపమును తొలగించుట, ఔదార్యము, భక్తి, శ్రద్ధ–ఈ సుగుణములను స్తుతించెను. శ్రద్ధయు, భక్తియు, నిష్టయు, యెడతెగని పరిశ్రమయు, యితరులయెడ పూజ్యభావమును మెచ్చుకొనెను. దానము చేయుటనుగూర్చియు, పుణ్యమును గూర్చియు, స్వర్గమును గూర్చియు, కామము, క్లేశము, కర్మము–అను మూడు ఉపాధుల యొక్క నీచత్వమును, నిష్ప్రయోజనమును, వానిచేకలుగు ఆపదలను గూర్చియు; యీమూటిని త్యజించుటవలన గలిగెడి లాభములను గూర్చియు

ఉపన్యసించెను. ఇదివిని మనస్సు సున్నితమై, మె త్తబడి అపోహలుతీరి పై మెట్టునకుచేరి ఉత్సాహ మునుపొంది, విశ్వాసము కలుగుటకు అనుకూ లమైన స్థితిలోనున్నప్పుడు ఆయన తథాగతుల ప్రత్యేక సిద్ధాంతములనుగూర్చి బోధించెను. దుః ఖము, దాని పుట్టుక, దాని నాశనమునుగూర్చి, అ ష్టాంగమార్గమునుగూర్చి వివరముగా ఉపోద్ఘాటిం చెను. ఉత్పత్తియైన ప్రతివస్తువులోను దానిని నశింప జేయుకారణము అప్పుడే యిమిడియున్నదని వారికి నచ్చజెప్పెను. అంత వారికి పవిత్రమును, నిష్క ళంకమును అగు ధర్మదృష్టి కలిగెను. (ఇట్టి ఉప న్యాసమును బౌద్ధులు "ధర్మమ్ కథం" అందురు. మనము ధర్మోపన్యాసములు లేదా ధర్మబోధ అన వచ్చును.) అది వినినంతనే అతడు ధర్మమును చూచి, గ్రహించి, లోతుపాతులను కనిపెట్టి, అను మానములను వీడి, యితర ఆధారము లేకుండగనే సంపూర్ణజ్ఞానమును సంపాదించెను. అంత మిక్కిలి గొన్న ఆనందముతో "మహాప్రభో! బోర్లపడిన గిన్నెను సరిగాపెట్టినట్లు, దాచినదానిని బయలు పరచినట్లు, దోవ తప్పినవానికి దోవచూపినట్లు, చీకటిలోనికి దీపముతెచ్చినట్లు అన్నిసంగతులు మీ బోధవల్ల నాకు తెలిసిన"వని బుద్ధునిపొగడెను. "భ

గవానుడగు బుద్ధునికిని, బుద్ధుని ధర్మమునకును, భిక్షు సంఘమునకును శరణుజొచ్చెద. నన్ను మీ శిష్యునిగా గైకొండు” అని వేడుకొనెను. తండ్రి వినుచుండ, ఆ బోధయంతయు కొమరుడు జీర్ణించుకొనెను. ప్రపంచమునందలి సంగము వీడెను. ఆసవములు అను యింద్రియరసములనుండి విముక్తుడయ్యెను. అది బుద్ధుడు గ్రహించెను. యాసుని జూచి ఆతనితండ్రి “కుమారా! మీయమ్మ చింతతో క్రుంగుచున్నది. ఆమెనుఓదార్చి ప్రాణమును తెప్పరిల్లజేయుము” అనికోరెను. అప్పుడుయాసుడు బుద్ధునివైపు జూచెను. బుద్ధుడు ఆ గృహస్థుని యిట్లుప్రశ్నించెను. “శ్రేష్ఠీ! నీకుమారుడు చక్కగా ధర్మమును గ్రహించలేదందువా? లోకబంధనములు ఆసవములు వీడలేదందువా? అట్లు విడిచినవాడు తిరిగి గృహస్థుడై ఇహలోక సౌఖ్యముల మునుపటివలె అనుభవించగలడా?” “అట్లు జరుగనేరదు” అని ఆశ్రేష్ఠి బదులు చెప్పెను. “ఇది నాకుమారునకు యాసునికి ఉపకారమే. ఆనందకరమే” అని ఆతడు ఒప్పుకొని బుద్ధుని, యాసుని మరునాడు భిక్షకు తన ఇంటికి పిలిచెను. బుద్ధుడు మౌనముగానుండి ఆవిందునను అంగీకరించెను.

అంతట ఆశ్రేష్ఠి తన ఇంటికిపోయెను. యాసుడు తనకు భిక్షుసంఘప్రదీక్ష యిప్పించమని బుద్ధునివేడుకొనెను. బుద్ధుడు దీక్షనొసంగి యిట్లు ప్రోత్సహించెను. "దుఃఖము అంతయు పూర్తిగా నశించుటకొరకు, పవిత్రమైన జీవితమును గడుపుము" అప్పటికి బౌద్ధసంఘములోచేరిన ఆరవ అర్హతుడు ఈ యాసుడు.

మరునాడు బుద్ధుడును, యాసుడును ఆ శ్రేష్ఠిగారి ఇంటికి భిక్షకుబోయి వారిచే పూజింపబడి. వారు అర్పించిన భిక్షను గైకొనిరి. యాసుని తల్లికిని, భార్యకును బుద్ధుడు బోధించెను. వారిద్దరును బుద్ధునికి శిష్యులైరి. కుటుంబ మార్గము లోనుండికూడ శిష్యులైన మొదటి ఆడవారు పీరు ఇద్దరే.

ఈయాసుడిట్లు తలగొరిగించుకొని కాషాయ వస్త్రములను ధరించెనని ఆతని స్నేహితులు, పట్టణములోని పెద్దకుటుంబీకులు నలుగురు వినిరి. విని తమ మిత్రుడు యాసుని మార్చిన ధర్మము సామాన్యమైనది కానేరదు. ఉత్కృష్టమైనదై యుండవచ్చునని యెంచి ఆ నలుగురును యాసుని సమీపించిరి. వారలను యాసుడు బుద్ధునియొద్దకు తీసుకొనిపోయి పరిచయము కలుగ

జేసెను. బుద్ధుని బోధలనువిని, వారి మనసులు విప్పారి, బంధనములు తెగిపోయి. వారును భిక్షువులై దీక్షనపొంది అర్హతులయి ఆనందము నొందిరి.



## — సోణునికథ —

అంగదేశమునకు రాజధాని చంపా యనుపట్టణము. బుద్ధునికాలమున యీ అంగదేశమును మగధరాజ్యములోనే చేర్చియుండిరి. ఆ చంపా యను పట్టణములోని పెద్దశ్రేష్ఠికి సోణుడను కుమారు డుండెను. అతనిని అతిగారాబముతో సుకుమారముగా పెంచుచుండిరి. అతడు భూమిమీద అడుగిడువాడు కాడు. అందుచే అతని అరికాళ్లలో వెంట్రుకలు మొలచెను. ఒకనాడు మగధరాజైన బింబిసారుడు తనరాజ్యములోని యెనుబదివేల గ్రామాధిపతులతో కొలువుదీర్చి యుండెను. అప్పుడు సోణుని సంగతివిని వానిని పిలువనంపించెను. సోణుడు పల్లకిలో బయలుదేరెను. "నాయనా! రాజు నీ అరికాళ్ళు చూడగోరుచున్నాడు. కాని రాజువైపునకు కాళ్ళుచాపరాదు. రాజు యెదుట పద్మాసనము వేసుకొనికూర్చుండుము. అప్పుడు రాజు నీకాళ్లను జూడవీలగును." అని అతని తలిదండ్రులు వానికి బోధించిరి. సోణుడంత రాజసభకువచ్చి రాజునకు సాష్టాంగమొనర్చి అతని యనుజ్ఞ చొప్పున తలిదండ్రులు చెప్పిన విధమున కూర్చుండెను. అప్పుడు

బింబిసారుడు ఆతనికాళ్ళపైన మొలచిన వెంట్రుకలను జూచి ఆశ్చర్యపడెను.

బింబిసారుడు రాజ్యాంగ విషయములలో గ్రామాధిపతులను హెచ్చరించి బుద్ధుని దగ్గరకు పొందనియు, ఆయన శాశ్వతధర్మములను గురించి వారికి బోధింపమనియు సెలవిచ్చెను. రాజుసెలవుప్రకారము వీరందరును బుద్ధుని తావునకు చేరవచ్చిరి. బుద్ధుని చూడగనే వీరికి గౌరవభావము కలిగెను. ఆయన వీరలకు దానము, పుణ్యము, స్వర్గములను గూర్చియు, కామముయొక్క నీచత్వమును గూర్చియు, త్యాగముయొక్క ఆధిక్యతను గూర్చియు, విపులముగా బోధించెను. వారి హృదయములు కరిగి అనుమానములుతీరి సంకటములు తొలిగి భక్తి విశ్వాసములు నెలకొనుచుండ బుద్ధుడువారలకు లోకములోని దుఃఖమును గూర్చియు, దాని కారణమును గూర్చియు, దాని నాశనమును గూర్చియు, ఆర్య అష్టాంగ మార్గముల గూర్చియు, వివరించి చెప్పెను. వారు జ్ఞానప్రసాదము పొందిరి. బుద్ధుని స్తోత్రము చేసిరి. ఆ ధర్మమును మెచ్చుకొనిరి. తాము బ్రతికియున్నంతమేర బుద్ధుని శిష్యులముగ యుందుమని వాగ్దత్తముచేసి గృహస్థశిష్యులయిరి.

వారితోపాటు వినుచుండిన సోణుడు గృహస్థశిష్యుడుగా నుండుటకు ఒప్పుకొనలేదు. ఈ భగవానుడు బోధించిన పవిత్ర ధర్మప్రకారము కుటుంబీకులుగానుండి అరమరలేని సంపూర్ణమైన పవిత్ర జీవితమును గడుప శక్యముగాదు. తలను, గడ్డమును, గొరిగించి కాషాయవస్త్రములనుగట్టి, ప్రపంచమును విడచి, ఇల్లులేని స్థితిలోనికి చేరకూడదా అని తనలో తాను ఆలోచించుకొ

నెను. ఇంతలో యెనుబదివేల గ్రామాధికారులును లేచి బుద్ధునికి తమ కృతజ్ఞతను తెలిపి సంతసమును వెలిబుచ్చి భగవానునికి ప్రదక్షిణముచేసి వెడలిపోయిరి. అంత సోణుడు బుద్ధుని సమీపించెను.

బుద్ధునికి నమస్కరించి వారి యనుమతిని బొంది ఒకవైపున కూర్చుండి తనకు కలిగిన కోరికను వారికి తెలుపుకొనెను. "నేను లోకమును వీడెదను. భిక్షువనయ్యెదను. ఇల్లు వాకిళ్ళు వదలెదను. నాపైకనుకంపించి నాకుదీక్షనిండు" అని వేడుకొనగా బుద్ధుడు వానిని భిక్షువుగా చేసెను. ఈ సోణుడు తీవ్రమైన నిష్ఠతో సాధన చేయుచుండెను. వట్టికాళ్ళతో యిటునటు తిరుగుచుండెను. అలవాటు లేనందున కాళ్ళు బొబ్బలెక్కి నెత్తురు కారుచుండెను. అతడు నడిచెడి చోటెల్ల కసాయివాని కొంపవలె నెత్తురుమయమయ్యెను. ఈ సోణుడొకపరి ధ్యానములోనుండ యీ భావము అతనికి తోచెను. "నాహృదయములో కామము నశించలేదు. ఆసవములు యెండిపోలేదు. ఇంటివద్ద అమితముగా ధనమున్నది. ఆ ధనమును అనుభవించుచు, దానములుచేయుచు, కాలము గడుపరాదా? క్రిందమెట్టుకు దిగి యీ రెండు లాభములను పొందరాదా?" అనుకొని మరల గృహస్థునగుదునని తలంచెను. వీనిభావమును తెలిసికొని బుద్ధుడు అవైపునకు వెడలెను.

బాటలోపడియున్న నెత్తురు మరకలనుచూచి అచ్చటి భిక్షువులను "ఈ నెత్తురు యెక్కడిది? ఇచ్చటనివసించు భిక్షు డెవరు" అని అడిగెను. సోణుడు పట్టుదలతో సాధనముచేయుచు తిరుగుచుండ అరికాళ్ళు పగిలి నెత్తురు కారెనని వారు చెప్పిరి. అంతట ఆయన సోణునిచెంతకు

చేరెను. సోణుడులేచి వారికిపీఠము అమర్చి నమస్కరించి వారిని కూర్చుండ బెట్టి తాను కూర్చుండెను. "సోణా! గృహస్థాశ్రమంబులో ప్రవేశింప తలంపు కలిగెనా మరల నీకు" అని బుద్ధుడు అడిగెను. "అవును ప్రభో" యని సోణుడు బదులు చెప్పెను. "సోణా! నీవు గృహస్థుడవై యుండగా వీణె వాయించుటయందు నేర్పరివి గదా" అని అడుగ, సోణుడు "అవును" అని పలికెను. "సోణా! నీవు తీగెలను మిక్కిలిగా బిగించినపుడు పాట పాడ వీలయ్యెనా?" అని బుద్ధుడు అడుగ "కాలేదు" అని సోణుడు జవాబు చెప్పెను. "పోనీ, సోణా! ఆతీగెలను చాలవదులుగా వుంచినపుడు పాటసాగెనా ?" యని మరలబుద్ధుడు ప్రశ్నించెను. "అప్పుడు అసలే సాగలేదు"ని సోణుడు మనవిచేసుకొనెను. "అయితే సోణా! మిక్కిలి బిగించక, మిక్కిలి వదులు చేయక సరిగా అమర్చిన యెడల మీ వీణె చెవులకింపుగా పాట పాడును గదా." అని బుద్ధుడు సూచించిన దానికి "నిజమే ప్రభో" యని సోణుడు మారుపల్కెను. "ఆ విధమువనే సోణా అత్యాతురమువలన దురభిమానము గలుగును. పట్టుదల లేనియెడల, సోమరితనము యేర్పడును. ఈ రెంటిని వీడి స్థిరబుద్ధికలవాడవై చలించని నిష్ఠతో సామ్యముగా నీమానసికి శక్తులను ఏకతానము చేయుము. అట్లు ఆదర్శము పెట్టుకొని ధ్యానము చేయుము." అని బుద్ధుడు ప్రబోధింపగా పూజ్యుడైన సోణుడు సమ్మతించెను. అదియే ఆదర్శముగాగొని, యితర భిక్షువులనువీడి ఒంటరిగా నుండి స్థిరుడై, దీక్షగలవాడై, నిశ్చలుడై జీవితము యొక్క పారమార్థికమును పొందెను. ఎందుకొరకు ప్రపంచములోని ఐశ్వర్యముగల యువకులు

తమ ఇల్లును, వాకిండ్లను, భార్యాబిడ్డలను అన్ని విధములయిన లాభములను, సౌఖ్యములను విడిచి, నిలువ నీడ కోరని నిత్యసంచారులై తిరిగెదరో, ఆ ఉత్తమపదమును యీ కంటియెదుట కనబడు లోకమునందుండగనే యీ సోణుడు సమీపించి, దాని రహస్యమును గ్రహించి, దానిని ముఖాముఖిని చూచి, దాని ఆనందమును అనుభవించి, ఆ ఆనందమున నోలలాడసాగెను. తనకు తిరిగి పుట్టుకలేదనియు, ఆధ్యాత్మికజీవితము దొరకెననియు, తన జీవిత కర్తవ్యము నెరవేర్పబడినదనియు, యీదేహము విడచిన పిమ్మట మరల దేహము కలుగదనియు, వర్ణించ నలవిగాని నిర్వాణపదము తాను చేరితిననియు, ఆ సోణుడు వ్రిత్యాకసు భావముతో తెల్పెను.

ఆట్లు సోణుడు అర్హతుడై తన యనుభవమును బుద్ధ భగవానుని యెదుట విశదీకరించుటకయి వారిని సమీపించి వారితో వినయ విధేయతలతో యిట్లుమనవిచేసెను. “అర్హతుడయినవానియందు యీఆరులక్షణములువికసించును. ౧. త్యాగము, ౨. ఏకాంతవాసమునందలిప్రేమ, ౩. హృదయమునందు కరుణ, ౪. కామముయొక్క నాశనము, ౫. తృష్ణానాశనము, ౬. భ్రమనుండి విముక్తి.” ఇట్టి సద్గుణములు ఆయనయందు ఒప్పుచున్నను, ఒకానొక సోదరుడు ఆయనను విమర్శింపవచ్చును. కేవలము శ్రద్ధకొరకే యీతడు త్యాగముచేసినాడని అనవచ్చును. కాని యేభిక్షువునందు ఆసవము లెల్లను వ్రేళ్ళతో పెకిలించబడినవో, యెవని జీవితము పూర్తిఅయినదో, యెవనికర్తవ్యము బాకీలేకుండ నెరవేరినదో వాడు తానింకను చేయవలసినది ఉన్నదని యెంచడు. తాను యిదివరకు

చేసిన పనులయొక్క ఫలితమును అనుభవించవలెనని తలం
పడు. కామము నశింపబడుట చేతనే, కామము అస
లు లేకపోవుట చేతనే త్యాగము పుట్టుచున్నది. దుర్బుద్ధి
నశించుట చేతనే, ఆ దుర్బుద్ధి అసలు లేకపోవుటచేతనే,
ఆయనకు త్యాగము కలుగుచున్నది. భ్రమలు నశించుట
చేతనే, అసలు భ్రమలు లేకపోవుట చేతనే, ఆతనికి
త్యాగము కలుగుచున్నది. ఏకాంతవాసము కోరినందుకు
యాతడు లాభమును, ఆతిథ్యమును, కీర్తిని ప్రీతి ఫల
ముగా కోరుచున్నాడని యెవరయినను చెప్పవచ్చును కాని
అట్లన జెల్లదు. లాభమునందలి కోరిక నశించుట
చేతనే, అసలు లాభపుకోరిక లేకపోవుటచేతనే, ఆ ఆతి
ధ్యమునందలి కోరిక నశించుటచేతనే, అట్టి కోరిక అసలే
లేకుండుట చేతనే, ఆ కీర్తియందలి కోరిక ఆతనికి నశిం
చుటచేతనే, ఆకీర్తియందలి కోరిక అసలే లేకపోవుట
చేతనే, ఆయనకు ఏకాంతవాసమునందలి ప్రేమ ఉద
యించుచున్నది. అర్హాతునిహృదయమున కరుణ నెలకొ
ల్పుటను, కొందరు ఆయన ఇంకను కర్మ జేయవలెనను
భావముతో నున్నాడని కారణము చెప్పవచ్చును. కాని
యీ కర్మయందలి నమ్మకము (ఆశ్రయము) నశించుట
చేతనే, అద్యాపి ఆధ్యాత్మికమయిన జీవితమునకు పరమా
వధియను భావము అసలు లేకపోవుటచేతనే, యీ అర్హా
తునిమనస్సు కరుణను పొందుచున్నది. ఇట్లే కామనాశ
నమును, తృష్ణానాశనమును, భ్రమవిముక్తియు, ఆయా
కామము, తృష్ణ, భ్రమలు సంపూర్తిగా నశించుటచేతను,
ఆయాయి గుణములు అసలే లేకపోవుటచేతను, ఈ అర్హా
తుడు ఉత్తమస్థితిని పొందుచున్నాడు. ఎవరిమనస్సు యిట్లు

నిష్ఠనొందినదో వానికంటియెదుట యేవస్తువులు కను బడినను, వాని మనస్సును వశపరచకొనజాలవు. వాని చెవిదగ్గర యేవి వినబడినను, వానిముక్కుదగ్గర యేయే వాసనలు కొట్టినను, వానినాలుక దగ్గర యేయే రుచులు పెట్టినను, వాని శరీరమునకు యే యే వస్తువులను తాకించినను, అవియేవియు వానిమనస్సును వశపరచుకొన జాలవు. వాని మనస్సు స్థిరమై, అచలమై, మాలిన్యరహితమై యుండి ఆ యావస్తువులు పోవు పోకడలనే ఆయన గమనించును. చీలికలులేక గట్టిదియై ఒకచే బండగానుండు కొండపై నాలుగుదిక్కులనుండి వానయు, గాలియు కొట్టుచున్నను, అదియెట్లువణకక, కదలక, నిలుచునో, అట్లే ఈ అర్హతులుకూడా సుస్థిరులైయుందురు. ఇట్టివాడు ప్రపంచములోని వస్తువులను, ఇంద్రియముల పోకడలను, ఆ వస్తువులవల్ల ఇంద్రియమునకు కలుగు వేదనలను, గమనించక ముక్తుడై వానియొక్క పర్యవసానమును తెలుసకొని, కోరెడి, కోరకుండెడి, వస్తువుల చేత కలతనొందక, నిప్పుకు నీరెత్తినట్లు శాంతివంతుడగును.

ఇట్లువిన్నవించిన సోణునికిని, తక్కిన భిక్షులకును బుద్ధభగవానుడిట్లు ఉపన్యసించెను. "బుద్ధిమంతులైన యువకులు ఇట్లు తమ దివ్యజ్ఞానమును వెలువరింతురు. సత్యమును పలుకుదురు. అహంకారము వారలను ఆవరింపదు. ఇట్టి దివ్యజ్ఞానమును పరిహాసము చేయువారు అపజయమును పొందుదురు" అనిచెప్పి సోణుని కరుణించి, "సోణా! గౌరవముతో పెరిగితివి. ఒంటిఅట్టుగల చెప్పులను ధరించుము" అని బుద్ధుడు అనతి యిచ్చెను. "ప్రభో!

నేను యిల్లువెడలి, ప్రపంచమునువీడి, భిక్షువును అయి నప్పుడు యెనుబదివెబండ్లు మోహరీలుగల బంగారము. ఏను ఏను గుల అంభారీలను విడిచివచ్చితిని. ఇట్టివాడే మనల చెప్పులు తొడుగుకొన్నాడని ప్రజలు అనవచ్చును. ఈభిక్షుసంఘ మునకంతరికిని మీరు యీ వీలును కలిగించినయెడల. నేనును చెప్పులు వాడెదను. సంఘమున కంతకును తాము అనుమ తించనియెడల, నేను అవి వాడజాలను" అని చెప్పి సోణుడు మన్నింపమని కోరెను. ఆమాటలనువిని బుద్ధుడు బౌద్ధసంఘ మున కంతకును ఆ సౌకర్యమును ఇయ్య అనుమతించెను.

---

## సీహాయను సేనానాయకుని కథ.

సీహాయనువాడు నిగ్రంథులు తెగను చేరిన వాడు. ఈ నిగ్రంథులు జైనమతమును స్థాపించిన మహావీరుని శిష్యులలోని దిగంబరులయిన తెగ వారు. ఈసీహుడు లిచ్ఛవి జాతికి చెందినవాడు. వారు పురమందిరములో చేరి బుద్ధుని పొగడుచుం డగా ఈ అర్హంతుడయిన బుద్ధుని చూడవలె నని తలంపు అతనికి కలిగెను. అంత తనగురువగు, నాతపుత్రుని చెంతకుజేరి, "ప్రభో! నేను శ్ర మణ గౌతముని చూడదలచెదను. నాకు సెలవిండు" అనికోరెను. అందుకాగురువు ఇటుచెప్పెను. "సీహా! నీవు క్రియావాదివి; కర్మములకు తగిన ఫలితములు

గలుగునని నమ్మెదవు. ఆ గౌతముఁడో కర్మలకు ఫలము లేదనును. అక్రియావాదము బోధించును. తన శిష్యులను నట్లే తయారుచేయును." ఈమాటలు వినగానే సీహునకుబుద్ధునిచూడవలెనను కోరిక తగ్గి పోయెను. ఇంకొకమారు పుర మందిరములో, బుద్ధుని, ఆయన సంఘమును, ధర్మమును, పెద్దలు పొగడుచుండగా సీహుఁడు వినెను. బుద్ధునిచూడ కోరిక మరల పొడమెను. తిరిగి తన గురువుయొద్దకు పోయి ఆజ్ఞనిమ్మనెను. మొదటివలెనే గురువు బోధించెను. ఈమారును ఆకోరిక నడలెను. మూడవసభా కూడా పురమందిరములో బుద్ధుని పొగడుట వినెను. ఇందలి పెద్దలు ఇన్నిమారులు ఇన్ని విధముల బుద్ధుని పొగడుచుండగా, ఆతఁడు నిజమైన అర్హతుఁడు అయియుండవచ్చును. ఈ నిర్గ్రంథులు ఒప్పుకొనినను, ఒప్పుకొనకున్నను నాకేమి? వీని సెలవు లేకుండగనే. నేను ఆభగవానుని యేలచూడరాదు? అని సీహుఁడు నిశ్చయించుకొనెను.

అంత పట్టపగలు ఐదువందల బండ్లుచేసుకొని తమ ముఖ్యపట్టణమగు వేసాలినుండి బయలువెడలెను. బండ్లు సాగినంతవరకు వానిమీద పోయి, అచ్చట దిగి, తర్వాత కాలినడకను బుద్ధునియొద్దకు చేరెను. ఆయనకు గౌరవముతో నమస్కరించి

చెంతనే కూరుచుండి బుద్ధుని ఇట్లు ప్రశ్నించెను. "శ్రమణ గౌతముడు కార్యఫలములు లేవనుచు అక్రియను బోధించును, అందులో శిష్యుల తయారుచేయును" అని వింటిని. "ప్రభో! అట్లు చెప్పెడివారు మిమ్ముగూర్చి సత్యము చెప్పుచున్నారా? మీ ధర్మమునకు బదులు దొంగధర్మమును మీపై అంటగట్టుచున్నారా? భగవంతునిపై అబద్ధములను ఆరోపించకుండునట్లు చేయుటయే నా యుద్దేశ్యము. ధర్మవిషయమై యిట్టి సంభాషణ చేయుటలో లోపముండదు. కాన సత్యాసత్యములను తెలియింతు."

"సింహా, శ్రమణగౌతముడు కార్యవాదమును నిరాకరించును. అక్రియావాదమును బోధించును. తన శిష్యుల నందులో తయారుజేయును" అని చెప్పుటలో కొంతనిజమున్నది. "సింహా, శ్రమణగౌతముడు క్రియావాదమును నిలువబెట్టెను. దానినే శిష్యులకుబోధించును. దానిలోనే శిష్యులను తయారుజేయును" అనిచెప్పుటలోను కొంత నిజముగలదు. "అదిగాక సింహా! శ్రమణగౌతముడు ఉచ్ఛేదవాదమును (నిర్మూలనవాదము) నిల్వబెట్టెను. దానిని బోధించును. దానిలో శిష్యులను తయారు చేయును." అని చెప్పుటలోను నిజముకలదు. "సింహా! శ్రమణ

గౌతముడు జుగుప్సతను (దూష్యభావము) ప్రక
టించును. దానిని బోధించును. దానిలో శిష్యులను
తయారుజేయును" అని చెప్పుటలోను కొంతనిజము
గలదు. "సీహా! శ్రమణగౌతముడు వినయమును,
సత్ప్రవర్తనను ప్రకటించును. దానినే బోధించును.
దానిలో శిష్యులను తయారుజేయును" అని చెప్పు
టలోను కొంతనిజముగలదు. "సీహా! శ్రమణగౌత
ముడు తపస్సును, అపగర్భతను (పుట్టుకలేకపోవుట)
ఆత్మవిశ్వాసమును ప్రకటించును. బోధించును. వీ
నిలో శిష్యులను తయారుజేయును" అని చెప్పుట
లోను కొంత సత్యముగలదు. పైనజెప్పిన అంశ
ములలో యెట్లెట్లు యెంతెంత సత్యము లిమిడి
యున్నదో వివరించెద వినుము.

"సీహా! మనస్సుచేతను, వాక్కుచేతను, క్రి
యచేతను— వీనిలో వేనిచేతను అధర్మమైన కార్య
ములను చేయవలదందును. మంచివిగానివియు,
చెడ్డవైనవియు, అగు హృదయ పరిస్థితులను
కల్పించవలదు అందును. నేను అక్రియావాది
ననునపుడు వున్న నిజమిదియే. మనస్సు,
వాక్కు, క్రియలచేత ధర్మమైన పనులను చేయు
మందును. చెడుగు గానివియు, మంచిదైనవియు,
అగు హృదయపరిస్థితులు కల్పించమందును. నేను

క్రియావాదిననునపుడు వున్న నిజమిదియే.”

“సింహా! కామమును, దుష్ట యిచ్ఛలను, దుర్భావములను, వీనికి అనుకూలమయిన హృదయపరిస్థితులను కూకటివేళ్ళతో పెళ్ళగించివేయుమందును. నేను నిర్మూలనవాదిననుటలో వున్న నిజమిదియే. మనస్సు, వాక్కు, క్రియలచేత అధర్మకార్యములయందు అసహ్యమును కల్పింతును. అట్టి హృదయపరిస్థితులు అసహ్యమని ప్రకటింతును. నేనుచేయు దూష్యవాదములోని నిజమిదియే. కామమును, దుష్ట యిచ్ఛలను, దుర్భావములను దూరముచేయుటకు అవసరమయిన సాధనమును, దానికి అనుకూలమగు పరిస్థితులను నిలువబెట్టుటకు మార్గములను జూపెదను. నేను వినయబోధకుడననగా వున్న నిజమిదియే. మనస్సు, వాక్కు, క్రియలయందుగల అధర్మములను, అట్టి అధర్మపరిస్థితులను మొదలంట కాల్చివేయుమందును. నేను తపోవాదిననగా వున్న నిజమిదియే. హృదయములో దుష్టత్వమును మొదలంట నరికి నిప్పులో వేసి కాల్చి మరల పుట్టుటకు వీలులేనట్లుగా దహనముచేయుటయే నిజమైనతపస్సు. తిరిగి తల్లికడుపులో పుట్టు అవసరము లేకుండ, ఇతర దేహములు పొందకుండ దానికి కారణమును మొదలంటపెరికి మ

కల పెరగకుండ చేయుటయే నేను అపగర్భవాది
నను టలో నున్న నిజము.”

“సీహా! నాకు అత్యున్నతమైన ఆత్మవిశ్వాస
ము గలదు. నా శిష్యులకందరకు అదియే బోధిం
చెద. వారల నందుతర్షియతు చేసెద. నేను విశ్వా
సవాదిననగా అందులో వున్న నిజమిదియే”

ఈవాక్యములను వినిన సీహాకు ఒడలు ఉ
ప్పొంగెను. అనేకవిధముల ఆయన బుద్ధుని పొగడెను.
నన్ను మీశిష్యునిగా వెంటనేగ్రహించుమని బుద్ధుని
వేడుకొనెను. “సీహా! నీవుచేయదలచినపనినిముందుగా
యోజించుకొనుము. నీవంటి ప్రముఖులు తగిన
ఆలోచనలేనిది యేపని చేయుట భావ్యముకాదు”
అని బుద్ధుడు వానికి బదులుచెప్పెను. ఆమాటలు
వినగానే సీహుడు “ఓప్రభో! నా ఆనందమును
భగవానునియందు నావిశ్వాసమును, మీ యీ మా
టలవలన మరింత పెరిగిపోవుచున్నది. ఇతరగురువుల
నెవరినయినను నన్ను మీశిష్యునిగా జేర్చుకొనమని
నేను కోరినయెడల వారు పొంగి, గెలుపుజెండాల
నెత్తి, వేసాలి పట్టణమునన్నెల్ల ప్రకటించి యుందురు.
కాని తాము అట్లుచేయక మరల యోజించుకొన
మని నాకు బోధించుచున్నారు. నేను యింకొక
పర్యాయము వేడెద. నన్ను మీశిష్యునిగా జేర్చ

కొనదు" అనెను. అంత బుద్ధుడు సింహుని పిలిచి "సింహా! అనేకదినములనుండి నీయింటిలో నిర్గ్రంథులకు అన్నపానము లిచ్చుచుంటివి. ఇకముందు వారు నీ యింటికి భిక్షకు వచ్చినయెడల, వారికి మామూలుగా అన్నపానము లిచ్చుటయే న్యాయమని నీవు గ్రహించవలెను" అని బుద్ధుడు ప్రబోధించెను. ఈమాటలు వినుచుండ సింహునికి మితిమీరిన ఆనందము, విశ్వాసము కలిగెను. "బుద్ధప్రభో, మిమ్ముగూర్చి యితరులు యెట్లు చెప్పుకొనుచున్నారో వినుడు. "శ్రమణగౌతముడు తనకును, తన శిష్యులకును మాత్రమే దానములు చేయమనును. ఇతర గురువులకును, వారి శిష్యులకును దానములు చేయకూడదనును. తనకును, తన శిష్యులకును యిచ్చిన దానములవలననే పెద్ద ఫలముగలదనియు, ఇతరుల కిచ్చినదాని వలన అంతయు ఫలములేదనియు, శ్రమణగౌతముడు అనును. ఇట్లు లోకులు ఆడు పలుకులకు భిన్నముగా నిర్గ్రంథులకుకూడ భిక్షపెట్టుమని నాకు మీరు ఆనతి యిచ్చుచున్నారు. వారు వచ్చినపుడు యోచించెద, మూడవమారు వేడుకొనెద. నన్ను మీశిష్యునిగా చేర్చుకొనుడు. అనెను. అంతట బుద్ధుడు ఆ సింహునకు ధర్మతత్త్వమును గూర్చి విపులముగా బోధించెను. అతని గృహస్థశిష్యునిగా

నంగీకరించెను. సీహుడు బుద్ధుని, బుద్ధసంఘమును, మరునాడు భిక్షకు పిలిచెను. బుద్ధుడు దానిని అంగీకరించెను.

మరునాడు సీహుడు చక్కని భోజనపదార్థముల నేర్పరచెను. నిర్గ్రంథులు కొందరు, "నేడు శ్రమణగౌతముని భిక్షకై సీహసేనాని, పెద్దయెద్దును చంపి భిక్ష చేయుచున్నాడు. అదియెరిగి గౌతముడు భోజనము చేయుచున్నాడు. ఈ జీవహత్యకు కారకుడు ఆతడే యని" వైశాలిలో నలువైపుల ప్రకటించిరి. ఈకబురు సీహుడు తెలిసెను, "దానిని లక్ష్యపెట్టకుడు. బుద్ధుని ధర్మమును, సంఘమును అపఖ్యాతిపాలు చేయుటకు పూజ్యులయిన యీ నిర్గ్రంథిసోదరులు చాలకాలమునుండి యత్నించుచున్నారు. వ్యర్థమైన అబద్ధములను భగవానునిగూర్చి చెప్పుటకు వారు విసుగుచెందకున్నారు. మా ప్రాణములమీదికివచ్చినను యెరిగియుండి మేమొక జీవినయిన చంపెదమా?" అని సీహుడు బదులు చెప్పెను. వేళకాగానే బుద్ధుడును, బుద్ధసంఘమును భిక్షకువచ్చిరి. సీహుడు తానే చాకిరితో ఉపచారములు చేసి తన చేతులతో వడ్డించెను. వారందరు భిక్షగైకొనిరి.

---

## జీవకకుమార బచ్చునికథ

వేసాలినగరములో ఆదినములలో యేడువేల యేడువందలయేడు మేడలును, యేడువేల యేడు వందలయేడు గోపురములుగల ఇండ్లును, యేడు వేల యేడువందలయేడు ఆట తోటలును, యేడు వేల యేడువందలయేడు తామర కొలనులును గలవు. అందకత్తెయైన అంబపాలిక యను వేశ్య గలదు. నాట్యము, సంగీతము, గానము, వీణె పాటలలో మెప్పొందిన నేర్పరి. ఆమె ఒక్కొక్క రాత్రికి యేబది నవరసులు పుచ్చుకొను చుండెడిది. ఆమెవలన వేసాలినగరము మరింత సంపదతో తులదూగుచుండెను. మగధ రాజనాయిను రాజగృహము (లేక గిరివ్రజము) పట్టణమునుండి పనిమీద వచ్చిన వర్తకుడు వేసాలినగరము మజూలి యుచ్చట పడి తాను ఇంటికిబోయి తన రాజు బింబిసారుని తో యీ వేసాలినగర వార్తలు చెప్పెను. వారు ఉభయులును యోచించి రాజగృహనగరమునకు, అంబపాలికను మించిన శాలావతియను నొకవేశ్యను నిల్పిరి. ఆమె మరింతనేర్పరియై రాత్రికి నూరు నవరసులు తీసుకొనుచుండెను. కొన్నాళ్ళలో యీ శాలావతి గర్భిణియాయెను. ఈసంగతి బాహ్యిరమైనయెడల,

తనవృత్తిపోవును అని ఆమె తనకు జబ్బుగాఉన్నది, అని ప్రకటింపచేసెను. ఇంతలో నెలలు నిండి ఒక బాలకుని గనెను. తట్టలో బెట్టి తీసుకొనిపోయి పెంటదిబ్బమీద పారవెయ్యమని తన నౌకరును ఆజ్ఞాపించె. అది అట్లుచేసెను. ఆదోవను పోవు అభయుడను రాజకుమారుడు ఆచటిమూగెడు కాకులనజూచి, చేరినప్రజలను యిది యేమియని యడిగెను. ఒక మగపిల్లవాడు ప్రాణముతో నిట పడియున్నాడు అని వారుచెప్పిరి. "మా హజారమునకు తెచ్చి దాదులకు ఒప్పగించవలెసినది. వారు పోషింతురు" అని చెప్పగా ఆప్రజలు ఆబాలుని యెత్తుకొనిపోయి ఆదాదులకు వప్పగించిరి. ప్రాణముతో ఉండిన బాలుడు గనుక జీవకుడనియు, రాజకుమారునిచేత పెంచబడినందున కుమారబచ్చాయనియు పేరుపెట్టిరి.

కొన్నియేండ్లకు యీ జీవకకుమారబచ్చు యుక్తవయస్కుడు ఆయెను. ఇతడు అభయుని సమీపించి, "యువరాజా! నాతలిదండ్రులెవరు?" అని అడిగెను. అంతట "జీవకా! నీతల్లి యెవరో నేనెరుగ నేను నిన్ను పోషించితిని గనుక నేనే నీ తండ్రిని" అని అభయుడు జవాబు చెప్పెను, అంత జీవకుడు ఏదయినను ఒకవృత్తి నేర్చుకొనక యీ

రాజకుటుంబములో జీవించుట కష్టము. అని యెంచి అభయునితో చెప్పక, బయలుదేరి అచ్చటచ్చట తిరిగి, చిట్టచివరకు తక్షశిలానగరముఁ జేరెను. అచ్చట అప్పుడు లోకప్రసిద్ధిగల వైద్యుడు ఉండెను. వానిని సమీపించి 'నాకు వైద్యమునేర్పుమని కోరెను. మిత్రమా! జీవకా! అట్లేనేర్చుకొమ్మని ఆయన సెలవిచ్చెను. జీవకుడు అక్కడ యేడు సంవత్సరములు నేర్చుకొనెను. వీడు చురుకైనవాడు తెలివిగా గ్రహించెను. గ్రహించినది మరచిపోడు. ఏడుసంవత్సరములు అయినపిమ్మట యీ చదువు యెప్పుడు పూర్తియగునని అనుకొని తన గురువును "నేను యింకా యెన్నాళ్ళు చదువవలెను" అని యడిగెను. నా ప్రియమయిన జీవకా! యీ గడ్డపార తీసుకొనిపోయి. యీ తక్షశిలానగరముచుట్టును అన్నివైపులను ఒక్క యోజనము (యేడున్నరమైళ్ళు) వరకును వెదకిచూచి మందుకు పనికిరాని మొక్క ఉన్నయెడల నాకు తెచ్చిచూపుము అని వైద్యుడు ఆజ్ఞాపించెను. ఆ ప్రకారమే జీవకుడు అన్నివైపుల తిరిగి తిరిగి. మందుకుపనికిరాని మొక్క పట్టలేక, ఆసంగతి గురువుకు మనవిచేసెను. నీ చదువు పూర్తి అయినది జీవనోపాధి సంపాదించుకొనుటకు యిది చాలును

అనిచెప్పి జీవకుని గురువు యింటికిబంపెను, దారిబత్తెముక్రింద కొంత ధనముకూడ యిచ్చెను.

సాకేతపురి చేరువరకు గురువిచ్చిన పైకము ఖర్చు అయ్యెను. ముందుండుదోవలు అడవిదోవలు. నీరు, అన్నము దొరకుట కష్టము పైకము లేనిది పోజాలము. ఇచ్చట కొంత ధనమును సంపాదించుట మంచిదని జీవకునకు తోచెను. సాకేతపురిలోని పెద్దశ్రేష్ఠిభార్య యేడు సంవత్సరముల నుండి తలనొప్పితో బాధపడుచుండెను. వైద్యులనేకులు మందులనిచ్చిరి. కట్నములబుచ్చుకొని వెడలిపోయిరి. కాని ఆమెబాధ తీరలేదు. ఈసంగతి తెలుసుకొని జీవకుడు వారి యింటికిపోయెను. అచ్చటికిపోయి నేను వైద్యుడననియు, శ్రేష్ఠిగారి భార్యను చూతుననియు, అచ్చట కాపలామనుజుని (ద్వారపాలకుని) ద్వారా లోపలికి కబురుచేసెను. వాడు యీ సంగతి శ్రేష్ఠిగారిభార్యకు చెప్పెను. ఆమె ప్రశ్నించగా యీ క్రొత్తవైద్యుడు యువకుడు అని తెలియజేసెను. వృద్ధులును, ప్రఖ్యాతులును అయిన వైద్యులు చేయలేనిదని వీనివలనకానేరదు, కాన పొమ్మనిచెప్పుము. అని ఆమె ఆజ్ఞాపించెను. అదివిని "ముందుగానేమియు నియ్యనక్కరలేదు. నాముందుపుచ్చుకొని నయ

నైనయెడల తోచినది యియ్యవచ్చును" అని జీవకుడు మరల కబురుపంపెను. ఈ మాటలు విని జీవకుని ఆమె పిలిపించెను. అంతట ఆతడు ఆమె ముఖవైఖరిని చూచి రోగమును నిర్ణయించుకొని కొన్నివస్తువుల తెప్పించి మందు తయారుచేసి వెల్లికిల పండబెట్టి ముక్కులోగుండ ఘృతమునిచ్చెను. ఆమె దానిని పుచ్చుకొని నోటినుండి కక్కెను. అది అచ్చట పళ్లెములో పడెను. దూదితెచ్చి యీ మందును ఒక గిన్నెలోకి నెత్తుమని ఆమె తన దాసితో చెప్పెను. ఈమె యింతలోభి. దీనితో నేమిచేయుదును? నాకేమి బహుమతి నిచ్చునని జీవకుడు సందేహించెను. ఆమె జీవకుని మొగము చూచి ఆభావమును కనిపెట్టి ప్రశ్నించెను. జీవకుడు ఉన్న నిజము చెప్పెను. ఆమె యీనేయి నౌకరు కాళ్ళు రుద్దుకొనుటకుగాని, దీపము పెట్టుకొనుటకుగాని, ఉపయోగపడును. గృహస్థులకు పొదుపుండవలెను. నీవు అనుమానించవద్దు. నీ బహుమతి తప్పకనిచ్చెదను. అని ఆమె చెప్పెను. ఆమందుతోనే ఆమెకు నయమయ్యెను. ఆమె నాలుగువేల నవర్సులు జీవకునికి కట్నముగా నిచ్చెను. తల్లికి నయమయినదని సంతోషముతో ఆమెకుమారుడు నాలుగువేల నవర్సుల నిచ్చెను. అత్తగారికి

రోగము నెమ్మదించెనని కోడలు మరి నాలుగువేల నవరహాలును. భార్యకు కుదిరినదని ఆ శ్రేష్ఠి యింకొక నాలుగువేల నవరహాలును, ఒక గుర్రపు బండిని, ఒకదాసుని, దాసిని యిచ్చెను. వీనితో జీవకుడు పయనమయి కొన్నిరోజులలో రాజగృహము చేరెను

తనను పెంచిన అభయకుమారుని యొద్దకు పోయి నమస్కరించి తాను సంపాదించిన సంపదను చూపి, వారికి అర్పించెను. "నన్ను పెంచినందుకు నాకృతజ్ఞతను తెలుపుకట్నముగా దీనిని గైకొనుడు" అని జీవకుడు కోరెను. "జీవకా! దానిని నీవేయుంచుకొనుము. మాదేవిడీని వదలక అందులోనే ఒక యిల్లు కట్టుకొనుము." అని అభయుడు సెలవియ్యగా జీవకుడు అట్లేచేసెను. ఆకాలమున బింబిసారునికి ఆసనమువద్ద కురుపులేచి బట్టలు నెత్తురు అగుచుండెను. ఆయన భార్యలు మీరుగూడ బయటచున్నారు. ఇక గర్భవతులు అగుదురు అని ఆయనను పరిహసించిరి. ఆయన చింతిల్లి అభయునితో చెప్పుకొనెను. అభయుడు జీవకుని పిలిచెను. జీవకుడు తన వ్రేలిగోటిమీద మందు తీసికొని పోయి ఆకురుపునకు ఒక్కపూత పూసెను. దానితో రాజునకు నయమయ్యెను.

ఆయన సంతసించి తన రాణులు అయిదువందల మందిని వారికి వున్ననగలన్నిఁ బెట్టుకొని, ఆయా వస్త్ర సొమ్మును జీవకునికి నిలువుదోపు యిమ్మని చెప్పెను. రాణులు అటు చేయబూనిరి. జీవకుడు దానికి సమ్మతించక తనను రాజవైద్యునిగా చేసిన చాలునని మనవి చేసెను. రాజకుటుంబమునకును, భిక్షుసంఘమునకును, ఇంటివైద్యునిగా జీవకుని బింబిసారుడు నియమించెను.

ఆనగరములోని పెద్దశ్రేష్ఠికి యేడుసంవత్సరములనుండి తలలో బాధకలిగి అనేకములయిన మందులు పుచ్చుకొని విసిగిపోయెను. కొందరు వైద్యులు యీతడు అయిదవరోజునను, మరికొందరు ఏడవరోజునను చనిపోవునని చెప్పిరి. ఆపట్టణములోని యితర వర్తకులు సంప్రదించుకొని రాజును వేడుకొని ఆయన అనుమతిమీద జీవకుని తీసికొని పోయిరి. జీవకుడా రోగిని చూచి నీకు నయమైన యెడల నాకేమిత్తువని అడిగెను. "నా ఆస్తియంతయు నీకిచ్చి నేను నీకు బానిసనగుదును" అని చెప్పెను. ఏడునెలల వరకు కదలకుండా ఒక ప్రక్కను, తరువాత యేడు నెలలవరకు కదలకుండా రెండవ ప్రక్కను, పిమ్మట యేడునెలలవరకు కదలకుండ వెల్లకిలను,

వడుకొనువారాయని జీవకుడడుగ, రోగి సరేననెను. అంత జీవకుడు వానిని పరుపుమీద పరుండబెట్టి, కాళ్ళు చేతులు గట్టిగా మంచమునకు కట్టి, తలపైన తోలును కత్తిరించి, రెండుకప్పులనుండి రెండు పురుగులను బయటికి తీసెను. అందులో ఒకటి పెద్దదియు, ఒకటి చిన్నదియు. "పెద్దదానినిచూచిన వైద్యులు అది మెదడులో ప్రవేశించుటకు అయిదురోజులు పట్టునని అంచనావేసిరి. చిన్నదానిని చూచిన వారు ఏడురోజులు పట్టునని అంచనావేసిరి" అని తెలిపి ఆతోలును కుట్టి మందురాచెను. ఆరోగి ఏడేడురోజులు మాత్రమే రెండు ప్రక్కలను వెల్లకిల పరుండెను. జీవకుడు అది చాలునని చెప్పెను. (ఇప్పటికిని శస్త్రము చేసిన యెడల వైద్యులు మూడువారములు విశ్రాంతిని విధింతురు.) అంతట ఆరోగి ఆరోగ్యవంతుడయి తాను చెప్పినప్రకారము కట్నము యిచ్చుటకు సిద్ధమయ్యెను. జీవకుడు అంతకట్నము యియ్యవద్దనిచెప్పి తాను ఒక లక్ష నవరసులను తీసుకొని రాజకోశమునకు మరియొక లక్ష శౌరుల నిచ్చునట్లుచేసెను.

ఆసమయమననే కాశీపట్టణములోని పెద్ద శ్రేష్ఠికుమారుడు మొగ్గలు వేయుచుండగా కడుపులోని ప్రేగులు వెలియబడి అన్నపానములు తీసి

కాని ఫలములేకపోయెను. ఆ శ్రేష్ఠి జీవకుని ఖ్యాతి విని రాజు సమ్మతిమీద జీవకుని తనయింటికి తీసుకొని పోయెను. జీవకుడు ఆరోగినిచూచి అతని అచ్చట నొక స్తంభమునకు అంటకట్టి కడుపుగోసి మెలియుబడిన ప్రేగులతీసి, ఆతనిభార్యకుచూపి, మెలివిప్పి సరిచేసి, లోపల నమర్చి, పైకట్టుకట్టి మందువేసెను. దానికి పదహారువేల నవరుసుల బహుమతిపొంది రాజగృహమునకు తిరిగివచ్చెను.

ఆకాలమున ఉజ్జయినీనగరమును చండప్రద్యోతుడను రాజు పాలించుచుండెను. వానికంట్లు పసికరమై యెన్నిమందులు తినినను, ఎంత డబ్బు ఖర్చుపెట్టినను నయముకాకుండెను. అంతట ఆరాజు బింబిసారునికి కబురుచేసెను. అతను జీవకుని పంపెను. జీవకుడు ఉజ్జయిని నగరముచేరి రాజునుచూచి కాచిననెయ్యి పుచ్చుకొనవలెనని చెప్పెను. కాని రాజునకు నెయ్యి అనిన డోకు. వేరేయొక మందునిమ్మని కోరెను. అంతట జీవకుడు నెయ్యిలేనిది యీరోగము నయముకాదు. ఏరూపముననైనను నెయ్యి యివ్వవలెను. దాని రంగు, వాసన, రుచి మారునట్లు కషాయముచేసి యిచ్చెదనని ఆలోచించి ఆప్రకారమే జరిపెను. రాజు దానిని పుచ్చుకొనెను. కాని జీవకుడుమాత్రం

యీ మందు అరుగునప్పుడు రాజుకు కక్కు వచ్చును.
అపుడు నెయ్యియిచ్చితినని కనగొనును. ఈరాజు
క్రూరుడు. నన్ను అప్పుడు చంపివేయును. ఈత
నికి ఇది జీర్ణమగు లోపలనే వెళ్ళిపోవలెను. అని
ఆలోచించుకొనెను. అంతట రాజుతో మేమిట్టివేళ
కొన్ని ఓషధులను, మూలికలను, సంపాదించవ
లెను. మీవాహనములలో నొకదానినిప్పించుడు.
ఇష్టమైన నగరద్వారమున వెళ్లుటకు అనుజ్ఞనిండు.
అని చెప్పెను. రాజు ఆజ్ఞ ఉత్తరువులు జారీ చే
యించెను. రోజుకు యాభై యోజనముల చొ
ప్పున నడువగల భద్రవతియను ఏనుగనెక్కి జీవ
కుడు తప్పించుకొని పోయెను. కొంతసేపటికి ప్ర
ద్యోతునికి డోకువచ్చి నెయ్యి కక్కెను. అంత జీ
వకుని మీద మండిపడి, వానిని పిలువమనెను.
వాడు అంతకుమునుపే యేనుగుమీద నెక్కిపోయి
నట్లు పరివారము చెప్పిరి. తన బానిసయగు కా
కాను పిలిచి నీవుపోయి జీవకుని పట్టుకొని రమ్మని
చెప్పెను. ఈకాకా అరువది యోజనములు నడు
వగలవాడు. వాడు జీవకుని కౌశాంబి యను నగ
రములో కలసెను. జీవకుని తిరిగి రమ్మనెను. జీవ
కుడు తాను భోజనముచేయుచు కాకా నీవుకూడా
భోజనము చేయుము అని చెప్పెను. కాని కాకా

తినవద్దు. "ఈ వైద్యులు కాంత్రికులు. వారు ఇచ్చునది తినవద్దు"ని రాజు అంతకు ముందే యాత్రనితో చెప్పియుండెను. జీవకుడు తాను అప్పుడు ఒక పండుతిని నీరు త్రాగుచుండెను. జీవకుడు తన గోటితో నొక మందునుతీసి ఆపండులోకలిపి ఆపండును, నీటిని, కాకాకు ఇచ్చెను. వైద్యుడు తినుచున్నది, త్రాగుచున్నది, తనకిచ్చినందున, ఇందులో మోసము ఉండదనియెంచి కాకా దానిని పుచ్చుకొనెను. అంతట వానికి విరోచనములు కాసాగెను. అదిచూచి భయపడి. "జీవకా! నాకు ప్రాణదానము చేయుము"ని కాకా వేడుకొనెను. "కాకానీవు భయపడవద్దు. నీకు నయము చేసెదను. మీ రాజు క్రూరుడు. నేను తిరిగివచ్చిన నన్ను చంపును" అని జీవకుడు చెప్పి కాకాకు ఎదిర్చి భద్రావటి యేనుగును తిరిగియిచ్చి కాకాను పంపివేసి తాను రాజగృహనగరము చేరెను. అచ్చట ప్రద్యోతనునికి నెమ్మదించెను. ఆతడు, జీవకుని పిలిపించి బహుమతి చేయనెంచి జీవకునకు కబురుచేసెను. కాని జీవకుడు రాడాయెను. తనకు కట్నము వలదనియు. రాజు తనను జ్ఞాపకముంచుకొనిన చాలుననియు కబురుచేసెను. ప్రద్యోతనుడు దానితో తృప్తిపొందక తనయొద్దనున్న మి

క్కిలి విలువగల, మిక్కిలి సన్నమయిన, ఉత్తమోత్తమమయిన, శిబిదేశములో తయారయిన, వస్త్రములను కానుకగా జీవకునకు పంపెను. జీవకుడు దానిని జూచి ముచ్చటపడి యీయది బుద్ధభగవానుడయినను, లేక బింబిసారుడయినను ధరించవలెనని యెంచి వారికి అర్పించుటకు వేచియుండెను.

బుద్ధభగవానుని కొకపర్యాయము జబ్బుచేసెను. ఆనందుడను శిష్యుడు జీవకుని పిలిపించెను. జీవకుడు బుద్ధునిచూచి కొన్నాళ్ళు ఆయన వొంటిని తైలముతో మర్దించవలెనని చెప్పెను. ఆనందుడు అట్లుచేసెను. అంతట జీవకుడు మూడు గుప్పిళ్ళ నీలతామర పుష్పములను తెచ్చి వాటికి కొన్ని మందులురాచి బుద్ధునికి చూపించి యిట్లుచెప్పెను. "ఈ ఒకగుప్పెడు ఒకపర్యాయము వాసన చూచినయెడల పదివిరోచనములగును. మూడుగుప్పెళ్ళు వాసన చూచినయెడల ముప్పదివిరోచనములు అగును. దానితో మీశరీరము బాగుపడును" అని విన్నవించి బుద్ధునికి ప్రదక్షిణము చేసి జీవకుడు వెడలిపోయెను. పోవుచుండగా యిరువైతొమ్మిది విరోచనములు అగుననియు, అంతట వేడినీళ్ళ స్నానము చేయవలెననియు, పిమ్మట ముప్పదవ విరోచన మగుననియు తోచెను.

వెంటనే జీవకుడు తిరిగివచ్చి ఆసంగతిని బుద్ధునితో చెప్పెను. వారట్లే చేసిరి. పిమ్మట కొన్ని దినములవరకు ద్రవపదార్థము లేనియు, తినరాదని పథ్యము పెట్టెను. కొలది దినములలో బుద్ధునికి నెమ్మదించెను. ఒకనాడు జీవకుడు ఉజ్జయిని రాజు తనకు యిచ్చిన ఒట్టలు తెచ్చి బుద్ధుని తనకొక వరమిమ్మని యడిగెను. "కోరబోవుకోర్కె తెలియనిది వరమియ్య వీలులేద"ని బుద్ధుడు శెలవిచ్చెను. ఇందులో దోషములేదని జీవకుడు మనవిచేయగా బుద్ధుడు సమ్మతించెను. అప్పుడు జీవకుడు తాదెచ్చిన ఒట్టను బుద్ధునికి సమర్పించెను. బుద్ధుడు దానిని స్వీకరించి ధర్మమును బోధించి అతని మనస్సును వికసించునట్లు జేసెను. అప్పటికి బుద్ధుడు బోధ మొదలుపెట్టి యిరువై సంవత్సరములు అయ్యెను అని బుద్ధఘోషుడను చరిత్రకారుడు తెలిపియుండెను.

భిక్షువులలో కొంతమంది తీపివస్తువులను యెక్కువగా తినుటవల్ల వేసాలినగరములో జబ్బుపడిరి. అప్పటికి జీవకుడు యితరపనిమీద వెళ్ళియుండెను. ఆ భిక్షువులనుచూచి వారి జాడ్యములను గ్రహించి, వారు కొంత వ్యాయామము తీసికొనవలెయుననియు, ఆవిరిస్నానములు చేయవల

యునని యు యేర్పరచెను. బుద్ధభగవానునితో మాట్లాడెను. వారు భిక్షువులు పచారుచేయుటకు (చంకములును,) దారులను ఆవిరి స్నానములు చేయుటకు జంతాగ్రిగృహములను నిర్మించ అనుజ్ఞనిచ్చెను.

ఆకాలములో మగధ రాజ్యములోని ప్రజలకు కురుపులు, మూర్ఛలు, క్షయ, తడికుష్టు, పొడికుష్టు అను అయిదుజాడ్యములు ఉండెను ఇట్టిరోగములు గలవారు భిక్షుసంఘములో చేరుచుండిరి. అట్లు చేరినవారికి జీవకుడు ఉచితముగా ఔషధమిచ్చి త్వరగా నయముచేయుచుండెను భిక్షువులు ఆ రోగులకు ప్రేమతో ఉపచారములు జేయుచుండెడివారు. రాజగృహపట్టణములోని పౌరులు కావలసిన వస్తువులను అర్పించుచుండిరి. ఈ సందును కనిపెట్టి మోక్షమునకుగాక, యీ రోగములను కుదుర్చుకొనుటకే కొందరు భిక్షువులుగాజొచ్చిరి. అందులో నొకడు తనరోగము కుదిరిన పిమ్మట భిక్షుసంఘమును వీడి కాషాయమును పారవేసి, తిరిగి సంసారములో ప్రవేశించెను. వాని నొకమారు జీవకుడు చూచెను. "నీవు సంఘములో చేరితివిగదా? ఇపుడు యిట్లున్నావేమ"ని అడిగెను. వాడు జీవకునకు ఉన్నది ఉన్నటుగా చెప్పెను

అంత జీవకుడు ఆ వార్త బుద్ధున కెరిగించెను.
బుద్ధుడు తగిన కట్టుదిట్టముల నేర్పరచెను

... ... ...

## — విశాఖ కథ —

విశాఖా మిగారమాత అని ఈమె పూర్తి పేరు. ఈమెకుమారుడు మిగారుడును, ఈమెయును మనుమడు— ఇద్దరును భిక్షువులయిరి. ఈమె గృహస్థాశ్రమములోనుండి ఉపాసకురాలుగా నుండెను. ఈమె మనుమని దీక్షపొందుటకు వర్షాకాలములో, చాతుర్మాస్యములలో భిక్షుసంఘము వద్దకు బంపెను. శ్రావస్తీ నగరములోనున్న ఆభిక్షువులు వర్షాకాలములో దీక్షనివ్వకూడదని దలచి, యీ మనుమని త్రిప్పిపంపిరి. ఈ సమాచారము బుద్ధునికి తెలిసి వారు కాలనియమము లేకుండ అందరికి దీక్ష యివ్వవచ్చునని శాసించిరి.

శ్రావస్తీ నగరములో బుద్ధుడు ఉండగా విశాఖ ఒకనాడు బుద్ధుని, భిక్షుసంఘమును భిక్షకు పిలచెను. బుద్ధుడు అంగీకరించెను. ఆమె ఆరా

తెచ్చియు, మరునాడును కావలసిన వంటలు తయారు చేయించెను. ఆరాత్రి పెద్దవాన కురిసెను. బుద్ధుడు ఆవానలో స్నానముచేయుడని అందరికిని సలహాచెప్పెను. వారు తమ బట్టలను విడిచిమొండి మొలలతో స్నానము చేయుచుండిరి వంటలు కాగానే విశాఖ వీరిని పిలుచుటకై తనబానిసను పంపెను. ఆచిన్నది వచ్చి చూచునప్పటికి వీరు దిగంబరులుగా నుండిరి. వీరు భిక్షువులు గారనియు, నిగ్రంధులనియు, ఆయమ తలచి యింటికి బోయి ఆరామములో భిక్షువులు లేరని విశాఖతో చెప్పెను. విశాఖ తెలివిగలది. కాన తన నౌకరు పడిన పొరబాటును గ్రహించి ఆతోటకే మరల తన నౌకరును పంపెను. ఆతోటకుబోయి అచ్చట నున్నవారితో వంటఅయినది దయచేయుడు అని చెప్పమనెను. ఈకన్యక వెళ్ళునప్పటికి భిక్షువులు స్నానములు చాలించి వళ్ళు తుడుచుకొని తమ తమ గదులలో నుండిరి. కాన ఆమెకు భిక్షువులు యెవరును కనబడలేదు. ఆపిల్ల తిరిగివచ్చి తోటలో యెవరు లేరనిచెప్పెను. విశాఖ మొదట వారు మొండి మొలలతో స్నానము చేయుచుండినట్లు ఊహించినట్లే, యిప్పుడువారు స్నానము అయినపిమ్మట గదులలో నుందురని ఊహించెను.

శానుతిరిగి నౌకరునుపంపెను. ఆమెవచ్చికబురుచెప్ప గానే బుద్ధుడును, భిక్షువులును బయలుద్దేరి విశాఖ యింటికి జని ఆమె సమర్పించిన భిక్షను అంగీకరించిరి. బుద్ధుడు ఆమెకు బోధించెను. ఆమె బుద్ధుని సమీపించి కూర్చుని తనకు యెనిమిదివరములు యిమ్మని వేడుకొనెను. "నీ కోరిక తెలియజేయకుండ అడిగినయెడల, తథాగతులు అంగీకరించరు" అని బుద్ధుడు జవాబుచెప్పగా "నాకోరికలు సవ్యమైనవి. ఆక్షేపణ వుండనేరదు" అని ఆమె బుద్ధునికి మనవిచేసెను. అంతట బుద్ధుడు నీకోరికను తెలుపుమని ఆజ్ఞాపించెను.

"భిక్షు సంఘమునకు వానకాలమందు కావలసిన బట్టలను, శ్రావస్థికి వచ్చెడి భిక్షువులకు అన్నమును. శ్రావస్తినుండి పోవువారికి అన్నమును, రోగులకు అన్నమును. రోగుల సేవ జేయువారికి అన్నమును, రోగులకు మందును, ఎడతెగకుండ సంఘమునకు గంజియును, స్త్రీ భిక్షువులకు నీళ్లు పోసుకొనునపుడు కట్టువస్త్రములని — నేను జీవించియున్నంతవరకు ఇచ్చెదను. నాపై అనుగ్రహించి ఇవి నావల్ల గ్రహింపుడని" ఆమె వేడెను. "ఈవరములు వేడుటలో నీ ఉద్దేశ్యమేమి" యని ఆమెను బుద్ధుడు ప్రశ్నించెను అంత ఆమె ప్రార్థనతిన

దాసివెళ్లి తిరిగివచ్చిన కథనువిన్నవించెను. మొండి మొలతో నుండుట అపవిత్రము. అసహ్యకరము. అందువలన భిక్షువులకు వానకాలమున వాడుకొనుటకై రెండవజత వస్త్రముల నియ్యదలచితిని. పొరుగూరునుండి వచ్చు భిక్షువు నడచి నడచి డస్సిపోయి వచ్చును. త్రోవలో భిక్షయెత్తవలెనన్న కష్టముగానుండును. అట్లు ఇల్లు ఇల్లు దిరుగుచు దోవమరచి పోవచ్చును. నాయింటివద్ద ప్రత్యేకముగా వానికి భిక్ష యిచ్చినయెడ చిక్కు ఉండదు. అందుచేత వచ్చెడి భిక్షువులకు నేను అన్నమిడెదనని చెప్పితిని. పొరుగూరుపోయెడి వాడు బాటసారులతో కలిసిపోవుచుండును. ఒక్కొక్కప్పుడు మకాములకు చేరుట ఆలస్యము కావచ్చును. అప్పుడు వానికి భిక్షదొరకదు. మధ్యగ్రామములో భిక్షమెత్తినయెడ, వానిని విడిచి బాటసారులు ముందు సాగుదురు. అప్పుడు అతను ఒంటరిగా బోవలసి వచ్చును. ఒంటరి నడక కష్టము. కాన పొరుగూరు పోయెడివారికి భిక్షపెట్టెదను. రోగము వచ్చినవానికి పథ్యము కావలసియుండును. భిక్షమెత్తిన అన్నము తినినయెడల వానిజాడ్యము కుదురదు. కాన రోగులకు పథ్యపానముల నేనే యిచ్చెదను. రోగికి సేవచేయువానికి ఆ సేవతోనే

కాలము గడచిపోవును. వాడు భిక్ష యెత్తుకొని వచ్చుసరికి అకాలమగును. అకాలమున అన్నము తినరాదని తాము శాసించితిరి. అందుచేత ఆ రోగియొక్క సేవకునకు నేనే తగినవేళ అన్నము పెట్టెదను. మందులు లేనియెడల బాధ అధికమగును. లేదా రోగముపెరిగి ఆతడు చనిపోవచ్చును. కాన అవసరమయిన మందులను నేను తెప్పించి యిచ్చెదను. భిక్షువులకు గంజి దానముచేయుట మంచిదని మీరు అంధకవిందపట్టణమున చెప్పితిరి. కాన అట్టిగంజిని ఇచ్చుటకు నాకు ఉత్సాహముగిలదు. ఆడభిక్షువులు అచిరావతినది ఒడ్డున కొందరు వేశ్యలతోగూడ మొండిమొలలతో స్నానము చేయుచుండిరి ఈవేశ్యలు మీయావనమును యేల పాడుచేసెదరని వారిని వెక్కిరించిరి. ఈ వెక్కిరింపువలన వారు కలవరపడిరి. స్త్రీలకు దిగంబరత్వము అపవిత్రము, అసహ్యకరము. కాన వారలకు స్నానము చేయుటకు ప్రత్యేకముగా బట్టల నిచ్చెదను— అని ఆమె తనమనస్సులోని కోరికలను బుద్ధునితో పూసగుచ్చినట్లు మనవి చేసెను. అంత బుద్ధుడు యీవరము కోరుటలో నీకుగల ప్రత్యేక లాభము ఏమిఅని అడిగెను.

"తాము యీ నగరములో నుండగా అచ్చ

టచ్చట చాతుర్మాస్యలు గడిపిన భిక్షువులు మిమ్ము లను చూడవచ్చు చుందురు. అక్కడక్కడ ఎవ రో భిక్షువులు చనిపోయిరని వారు చెప్పుచుందురు. వారిసాధనకు ఫలితముగా యెట్టియెట్టి ఉన్నతస్థితిని పొందిరని మిమ్ము అడుగుచుందురు. అట్టివేళ నేను ఆ క్రొత్తవారి దగ్గరకుపోయి ఆ చనిపోయిన భిక్షువు యెన్నడయిన శ్రావస్థీ నగరము నకు వచ్చెనా యని అడిగెదను. వారు ఔనని చెప్పినయెడల ఆ చని పోయిన సోదరుడు యిచ్చట నావలన ఉపచారము పొందెనుగదా అని యెంచెదను. అంత నాకు తృప్తి కలుగును. దానిచే సంతోషమును, ఆనం దమును, దానిచే శాంతియును, దానిచే సాధన యును, దానిచే జ్ఞానమును కలుగును. నేను ఈ వరములు అడుగుటలో నాయుద్దేశ్యములుయివియే" అని ఆమె బుద్ధునికి విన్నవించెను.

"విశాఖా! మంచిది. ఇట్టి ఉద్దేశ్యముతో వరములు కోరుట మేలైనవని. ఎవరయినను మనసు నందు ఉత్సాహముతో, కోరికలు లేకుండ, లోభ ములేకుండ, అన్నపానముల నిచ్చినయెడల వారికి దుఃఖము నశించును. సంతోషము కలుగును. సన్మార్గము కనబడును. నాశనములేని—అపవిత్రి ముగాని, శ్రేయస్సు లభించును." అనిబుద్ధుడు ఆశీ

ర్పాదించి, విశాఖకు కృతజ్ఞత దెలిపెను.

ఒకనాడు బుద్ధుడు శ్రావస్తీ నగరములోనుం డగా విశాఖ వారినిసమీపించి మొగము తుడుచు కొనుటకు ఒక వస్త్రమును వారికి అర్పించెను. చె మట పోయునపుడు అది ఉపయోగించునని ఆమె ఉద్దేశించెను.

మరియొకప్పుడు బుద్ధభిక్షువులలో కలతలు సంభవించి రెండుకక్షులు యేర్పడెను. అందులో నొకరు బుద్ధుడున్నచోటికి వచ్చుచుండిరి. వారిని యెట్లు ఆదరించవలెనో విశాఖకు తోచక బుద్ధుని సమీపించి తాను యేమి చేయవలెనని అడిగెను. అందుకు ఆయన యిట్లు ఆనతిచ్చెను. "విశాఖా! రెండుపక్షములవారును చెప్పు ధర్మమును వినుము. ఉభయులకును కానుక లర్పించుము. ఎవరు చె ప్పిన అభిప్రాయము బుద్ధధర్మముతో అనుకూల ముగా నున్నదో దానిని అంగీకరించి, ఆపక్షము సక్రమమయినదని నమ్ముము.

ఆమె భిక్షుసంఘమునకు చిన్న చిన్న కుం డలను, స్తంభముల మీద అమర్చు కాయలను అప్పుడప్పు డిచ్చుచుండెను. ఆమె భిక్షుసంఘము నకు మేడలనుగూడ కట్టించి యిచ్చుచుండెను.

## — ♦ కా శీ రా జు క ధ. ♦ —

ఒకానొక కాలమున కాశీనగరములో బ్రహ్మదత్తుడనురాజు రాజ్యము చేయుచుండెను. ఆదేశసమయమున కోసలములో దీర్ఘీతి అనువాడు రాజుగా నుండెను. కాశీరాజునకు ధనము, సేన, రధములు, రాజ్యము, అదా విస్తారముగానుండెను. కోసలపతికి అన్నియు కరువయ్యెను. బ్రహ్మదత్తుడు చతురంగ సేనతో కోసలముమీాద దండెత్తెను. ఈతని దాడికి ఓర్వజాలనని దీర్ఘీతి తన నగరమును విడిచి తానును, తనరాణియు పారిపోయిరి. కోసలము కాశీరాజ్యములో చేరిపోయెను. అచ్చటచ్చట తిరిగి తిరిగి మారువేషములు వేసుకొని దీర్ఘీతియు, భార్యయు కాశీనగరముచేరి ఒక కుమ్మరివాని యింటిలో కాపురముండిరి. దీర్ఘీతి సన్యాసివలె, భిక్షమెత్తి కాలము గడుపుచుండెను.

ఇట్లుండగా ఆయనభార్య గర్భవతియయ్యెను. వేవిళ్ళ కాలములో ఆమెకు ఒకకోరిక కలిగెను. సూర్యుడు ఉదయించువేళ వ్యూహముగా పన్నిన చతురంగసేనను చూడవలెననియు, వారి కత్తులు గడిగిన నీటిని తాగవలెననియు ఆమె

తలపెట్టెను. ఈ సంగతిని భర్తతో చెప్పెను. ఇది దుస్తరమని అతను చింతించెను. ఇదినెరవేరక పోయిన నేను బ్రతుకనని ఆమె చెప్పగా, దీక్షితి ఉపాయములు వెదక నారంభించెను. అదృష్ట వశమున బ్రహ్మదత్తుని పురోహిత బ్రాహ్మణుడు దీక్షితికి స్నేహితుడు. అంత దీక్షితి తన స్నేహితునితో యీ మాటచెప్పెను ఆ బ్రాహ్మణుడు, ఈతను ఉండుచోటికివచ్చి గర్భిణి నిజమని తెలిసుకొని ఆమె కోర్కెతీర్చెదనని చెప్పిపోయెను. ఆమె గర్భమందు కోసలరాజు మెలగుచున్నట్లు అతను ఊహించెను. పిమ్మట బ్రహ్మదత్తుని సమీపించి రేపు శుభసమయమనియు, అట్టిచో పవిత్రమయిన స్థలమందు కవచములను ఖడ్గములను ధరించి చతురంగ సేనలు బారులుదీరి సూర్యోదయమువేళ నిలువ వలయుననియు, వారుకత్తులు నీటిలో కడుగవలయుననియు సలహా చెప్పెను. బ్రహ్మదత్తుడు సమ్మతించి అట్లే ఆజ్ఞాపించెను. అందువలన ఆయనసేనలు అట్లు అమర్చబడెను. దీక్షితునిభార్యకోరిక తీరెను. నెలలు నిండగానే ఆమె ప్రసవమయి ఒక బాలుని కనెను. వానికి దీర్ఘాయువు అని పేరిడిరి. ఇట్లు కాలము గడుపుచుండ దీర్ఘాయువు యౌవనవంతుడయ్యెను. అంత దీక్షితి

"కాశీరాజు మా విరోధి. మా జాడపట్టిన మా మువ్వురను చంపించును. కాన యీ దీర్ఘాయువును మరొకచోటనుంచుట మంచిది" అని ఆలోచించి కాశీపురిబయట అతనికి బస యేర్పాటుచేసెను.

ఇట్లుండగా యీదీక్షితు నెరిగిన మంగలివాడొకడు కాశీలో తిరుగుచు, దీక్షితుని గుర్తుపట్టి బ్రహ్మదత్తుని చేరి యీ రహస్యమును చెప్పెను. అంత బ్రహ్మదత్తుడు తన బంటులను బంపి వీరిద్దరిని బట్టితెప్పించి వీరల పట్టణమెల్ల త్రిప్పవలెననియు, కాళ్లు చేతులు కట్టివేయవలెననియు, తలలు గొరిగించవలెననియు, నాలుగు ముక్కలుచేసి నాలుగు వైపుల పారవేయవలయుననియు ఆజ్ఞాపించెను. రాజభటులు యిటుల త్రిప్పుచుండగా తల్లిదండ్రులను చూడవలెనని కోరికగలిగి కాశీలో ప్రవేశించిన దీర్ఘాయువు వారల దగ్గరకు వచ్చెను. వానిని దూరమునుండియే దీక్షితు చూచెను. "దీర్ఘాయూ! దూరము చూడవద్దు. దగ్గర చూడవద్దు. ద్వేషమువల్ల శాంతింపదు. అద్వేషమువల్లనే శాంతించును" అని కేకలిడెను. ఆ కేకలువిని దీక్షితునకు పిచ్చియెత్తినదని రాజభటులు తలంచిరి. నాకు పిచ్చిలేదనియు, తెలివిగలవాడు దీనిని అర్థము చేసుకొనుననియు, తిరిగి దీక్షితు బదులు చెప్పెను. కాని

రాజభటులు నమ్మలేదు దీక్షితికిని, దీర్ఘాయువునకును గల సంబంధము ఊహించలేదు. రాజాజ్ఞ ప్రకారము భార్యాభర్తలను ఊరివెలుపలకు నడపించి, నరికి ముక్కలుచేసి పారవేసిరి. కొందరు భటులు అచ్చట కావలాయుండిరి. తక్కినవారు వెడలిపోయిరి. విషమెక్కువగాగల మద్యమును తెచ్చి దీర్ఘాయువు వారల త్రాగించెను. వారు త్రాగి పడిపోయిరి. తన తల్లిదండ్రుల దేహముల ముక్కలను పోగుచేసి దీర్ఘాయువు కాష్టముపేర్చి నిప్పంటించి దానిచుట్టును ముమ్మారు తిరిగి నమస్కారము చేసెను. బ్రహ్మదత్తుడు తన మేడమీదనుండిదీనిని చూచి వీడు ఎవడో దీక్షిత కులస్థుడో లేక బందువో అనుకొనెను.

అక్కడ దగ్గరనున్న అడవికిబోయి కడుపు పగులునట్లు దీర్ఘాయువు ఏడ్చెను. కన్నీరు తుడుచుకొని ఆలోచించుకొని తిరిగి కాశీ ప్రవేశించెను. రాజు ఏనుగ శాలవద్దకుబోయి మావటీలలో మేటిని సమీపించి, అయ్యా! నాకీపని నేర్పుమనెను. ముద్దుబిడ్డా! కూరిమికుర్రవాడా, అట్లే నేర్చుకొనుము అని వాడు చెప్పెను. దీర్ఘాయువు ఆ రాత్రి అక్కడనే నిద్దురపోయెను. వేకువజామున లేచి శితారు తీసుకొని చక్కనిగొంతుతో పాట

పాడెను. రాజనగరములోని బ్రహ్మదత్తుడు ఆ పాటవిని సంతోషించి మరునాడు వీనిని గురించి విచారించి పిలిపించుకొనెను. రాత్రి పాట పాడినది నీవేనా? అనియడిగెను. అవునని చెప్పగా మరల నొకమారు దానిని పాడుమని ఆజ్ఞాపించెను. మరింత యింపుగా దీర్ఘాయువు సంగీతము పాడెను. రాజు వానిని మెచ్చుకొని ఖుద్దున నౌకరుగా యేర్పరచెను. దీర్ఘాయువు రాజుకంటెముందు నిదురలేచుచు, తు. చ. తప్పకుండ ఆయనఆజ్ఞలనుపాలించుచు అనుకూలముగా ప్రవర్తించుచు, ఇంపుగా మాటలాడుచు, రాజునిద్రబోయిన తరువాతపడుకొనుచు, అన్నివిధముల రాజుకు అనుకూలుడయ్యెను. రాజు విశ్వాసము హెచ్చి తన దగ్గరగానుండు పెద్ద ఉద్యోగమును ఆయనకు యిచ్చెను. ఒకనాడు రాజు వేటకు బోదలచి గుర్రములనుకట్టి రథము తెమ్మని దీర్ఘాయువును పంపెను. అట్లు రథముతేగా రాజురథమెక్కి దీర్ఘాయువును తోలుమనెను. సేనలు వెంటవచ్చుచుండెను. కొంతదూరముపోయి దీర్ఘాయువు దోవతప్పించి వేరు దోవ పట్టించి సేనకు బహుదూరముగా రాజును తీసుకొనిపోయెను. రాజు అలసిపోయి, రథమును ఆపించి దీర్ఘాయువు తొడమీద తలపెట్టుకొని ఒక్కింత తడవు నిద్రిం

చెను. ఆమోటరిపాటున బ్రహ్మదత్తుని చేజిక్కించుకు
కొనిన దీర్ఘాయువునకు మంచి అదను దొరకెను.
తన సేనను, రాజ్యమును—సర్వస్వమును దోచు
కొని తలిదండ్రులను నరికించిన రాజుపయి కసిదీర్చుకొ
నుటకు యిదే తరుణమని దీర్ఘాయువు వరనుండి
కత్తిదూసెను. అప్పుడు దీర్ఘితి చెప్పిన పలుకులు
అతనికి జ్ఞాపకమువచ్చి తండ్రిమాట జవదాటరా
దని కత్తిని మరల వరలో దాచెను. ఇట్లే కత్తి
దూయుటయు, దాచుటయు రెండు మూడుపర్యా
యములు జరిగెను. ఇంతలో బ్రహ్మదత్తుడు తటా
లున ఒడలు ఒణుకుచు, భయపడుచు ఆవేదనతో
లేచెను. ఇట్లు ఏల లేచితిరి అని దీర్ఘాయువు
అడిగెను. కోసలరాజయిన దీర్ఘితికొడుకు దీర్ఘా
యువు కత్తిని ఆడించుచు నాపై దుమికినట్లు కలగం
టిని అని రాజుచెప్పెను. అప్పుడు దీర్ఘాయువు
రాజునెత్తిన తన ఎడమచేతిని బెట్టి, కుడిచేతితో
కత్తినిలాగి, నేనే దీర్ఘాయువును. నీవుచేసిన కీడుకు
కసి తీర్చుకొందును అని బెదరించెను. నిరాయు
ధుడయిన బ్రహ్మదత్తుడు దీర్ఘాయువు కాళ్ళమీద
పడి నా ప్రాణమును రక్షించుమని ప్రార్థించెను.
దీర్ఘాయువు "నేను నిన్నెట్లు రక్షించగలను! నీవే
నా ప్రాణదానము చేయుము" అని బ్రహ్మదత్తుని

కోరెను. అట్లయినచో దీర్ఘాయువా, నీ ప్రాణ మును రక్షించితి. నా ప్రాణమును కాపాడుమని తిరిగి బ్రహ్మదత్తుడు కోరెను. ఒండొరుల ప్రాణముల కాపాడుకొందుమని ప్రమాణములు చేసుకొనిరి. తిరిగి రథమును అమర్చుకొని కాశీ చేరిరి. రాజు తన మంత్రులను బిలిచి దీర్ఘాయువు తన బడినయెడల యేమి చేయవలెనని సలహా అడిగెను. ఒకడు కాళ్ళను—ఒకడు చేతులను—ఒకడు తలను నరకవలెనని సలహా చెప్పిరి. రాజు అడవిలో జరిగిన కథనంతయు వారికి చెప్పి, ఈ దీర్ఘాయువును ఎవరు తాకగూడదు అని ఆజ్ఞాపించెను. నిద్రించుచున్న రాజును దీర్ఘాయువు ఏల చంపలేదు అను ప్రశ్న రాగా, తన తండ్రి చెప్పినమాటలను దీర్ఘాయువు వారికి వినిపించెను. విరుద్ధముగానున్న ఆ మాటల భావమేమని వారు అడిగిరి. అంతట దీర్ఘాయువు ఇట్లు బదులుచెప్పెను. దూరముగా చూడవద్దు. అనగా—క్రోధము చాలకాలము మనసులో ఉంచుకొనగూడదు. దగ్గరగా చూడకుము. అనగా— త్వరపడి స్నేహితులతో పోట్లాడకూడదు. ద్వేషమువలన శమించదు. అనగా—మీరు నా తలిదండ్రులను చంపితిరి. నేను మిమ్ము చంపెదను. మీ భటులు నన్ను చంపెదరు. నా స్నేహితులు

వారిని జంపెదరు. ఇట్లు అంతులేకుండ ద్వేషము పెరుగునుగాని ఆనిప్పు చల్లారదు. అని అర్థము. అద్వేషమువలన శమించును. అనగా మీరు నాప్రాణమును రక్షించితిరి. నేను మీప్రాణమును కాపాడితిని. మనకు స్నేహము యేర్పడి పూర్వ ద్వేషములు నశించినవి. ఈమాటలు వినినవారందరును దీర్ఘాయువును మెచ్చుకొనిరి. అతనికి రాజు తన కూతురునిచ్చి పెండ్లిచేసి, కోసలరాజ్యమును. సేనను, ధనమును అరణముగా నిచ్చెను.

భిక్షుసంఘములో తగువులువచ్చి చీలికలు గలిగినప్పుడు బుద్ధుడు యీకథను చెప్పెను.

—...—

## ౧ దబ్బా కథ. ౧

మాల్యదేశస్థుడయిన దబ్బా అనువాడు యేడవసంవత్సరముననే అర్హాతుడయ్యెను. వాని కర్మసంచయమును, ప్రారబ్ధమును నశించెను. ముందు చేయదగిన కర్తవ్యము లేకుండెను. ఒకనాడతడు ధ్యానములోనుండగా ఈ భిక్షుసంఘమునకు నేను

ఏమయిన సేవచేయగలనా? అను ఆలోచన స్ఫురించెను. వీరలకు అవసర ద్రవ్యముల పంచిపెట్టుటయు— ఇండ్లకు వసతులు చూపుటయు—మంచిదని ఆయనకు తోచెను. ఆనాడు సాయంత్రము బుద్ధుని సమీపించి. నమస్కరించి ఒక వైపున కూర్చుని తనకుతోచిన ఆలోచనలను బుద్ధునితో మనవిచేసెను. బుద్ధుడు నీకు తోచినది మంచిదే. అట్లే జరుపమని అనతిచ్చెను. దబ్బా సంతసించి ఆపనికి బూనెను. అప్పుడు సంఘములో తీర్మానముచేసి అతనిని ఆయా పనులకు నియమించిరి. దబ్బా ఆ భిక్షువులకందరకు అనుకూలమగునట్లుగా వసతులను చూపుచుండెను. వినయముతో చదువువారు అందరు ఒకవైపునను, ధర్మమును బోధించువారు ఇంకొకవైపునను, సూత్రములు పఠించువారు మరియొకవైపునను, ధ్యానముచేయువారు వేరొకవైపునను వుండునట్లు వసతులు యేర్పాటుచేసెను. కొందరు దబ్బాను పరీక్షించుటకై ఆలస్యముగా వచ్చుచు, దూరప్రదేశములను కోరుచూ అతనిని త్రిప్పుచుండిరి. కాని ఎట్లు ఏ వేళ ఎవరు వచ్చినను. వారల కందరకు తగిన వసతులను చూపుచుండెను. ఇది నీపక్క—ఇది నీపీట—ఇదియే చాప—దిండు యిది—పాయిఖానా అది—

మంచినీరుఇది. ఇతరవాడుకనీరు అది, ఇది చేతికఱ్ఱ, అది సంఘమువారు సభచేసెడి చోటు. ఆయావేళల రావలెను. ఆయావేళల పోవలెను." అని అన్ని సంగతులు వారికి తెలియజెప్పుచుండెను. ఆభిక్షువులలో మెట్టియుడు, భుమ్మజక అనువారు యిద్దరును, వారి అనుచరులును, తమకిచ్చిన గదులు, తిను బండారములు తృప్తిగాలేవని సణుగుచుండిరి. రాజగృహనగరములో ఒక గృహస్థు ధనవంతుడై భిక్షువులను ఎల్లకాలము విందుకు పిలుచుచుండెను. ఒకనాడు అతడు దబ్బావద్దకువచ్చి, వానితో సంప్రదించి, మరునాడు తన యింటికివచ్చు భిక్షువులెవరని అడిగెను. మెట్టియ భుమ్మజక మురావత్తురని దబ్బా చెప్పెను.

ఈ గృహస్థుకు ఈమెట్టియ మురానుగూర్చి తృప్తిగలుగలేదు. అందుచే వారలు వచ్చునదికి సామాన్యమైన వంటకములు చేయించి వారికి వడ్డించమని తన నౌకరుతో చెప్పెను. ఈభిక్షువులువచ్చి భుజించిరి. తమకు సరియయిన ఆదరణ కలుగలేదనితలచిరి. దీనికి దబ్బాకారకుడని యెంచిరి. క్రిందటిరోజు దబ్బాయును, ఈగృహస్థుయును మాట్లాడినప్పుడు దబ్బా మనపై నిందలు మోపియుండుననిసందేహించిరి. మరునాడు మిట్టియా. అను ఆడభి

క్షువు ఈముదితా దగ్గరకువచ్చి ఒకటి, రెండు, మూడుపర్యాయములు నమస్కారము చేసెను. వీరు మెదలకుండ నుండిరి. "నేను యేమితప్పుచేసితిని, మీకేల కోపమువచ్చె. ఏల నాతోమాట్లాడరు" అని ఆమె అడిగెను. దానికి బదులుగా వారు ఇట్లు చెప్పిరి. "దబ్బా మమ్ము బాధపెట్టుచున్నాడు. నీవు యేమియు పట్టించుకొనవు. నీవు తలపెట్టినచో ఈ దబ్బాను ఒకనిమిషములో వెళ్ళగొట్టగలవు." ఈమాటలువిని ఆయమ ఉపాయము ఏమని అడిగెను. నీవు బుద్ధునియొద్దకుబోయి, "అనుకొనని చోటున ఆపద బుట్టినది. నీరు నిప్పయి మండుచున్నది. దబ్బా నన్ను భంగపరచెను" అని బుద్ధుని యొద్ద మొరబెట్టమని వారు సలహా చెప్పిరి. ఆమె అట్లే చేసెను,

బుద్ధుడు భిక్షుసంఘసభ జరిపి సభలో దబ్బానుపిలిచి "దబ్బా! ఈఆడభిక్షువు చెప్పినపనిని చేసినట్లు నీకు గుర్తు గలదా?" అని అడిగెను "ప్రభో! భగవంతుడా! మీరు నన్ను ఎరిగియేయున్నారు" అని దబ్బా జవాబుచెప్పెను. బుద్ధుడు రెండవ మారు కూడా అడుగ దబ్బా అట్లే జవాబు చెప్పెను. అంతట బుద్ధుడు "నీవంటివారు నిందను ఇట్లు ఎదిరించరు. నీవు చేసినచో ఒప్పుకొనుము. చేయనిచో

చేయలేదని చెప్పాము" అని బుద్ధుడు పలికెను. "ప్రభో! నేను పుట్టినదిమొదలు యింతవరకు జాగ్రతస్థితిలో సంభోగము చేయలేదు. సరిగదా, కలలోనయినను అట్లుచేసినట్లు నాకు రవంతయు గుర్తు లేదు." అని దబ్బా మనవి చేసుకొనెను ఈ ఆడ భిక్షువు ఆ మెట్టియ ముతావలన పురిగొల్పబడినట్లు తెలియవచ్చెను. ఈమెను వెడలనడుపుడు. వారల విచారించుడు. అని బుద్ధుడుచెప్పి లేచిపోయి విహారములో ప్రవేశించెను. (విహారమనగా వారుండినగది) అంత ఆ మెట్టీయముతా భిక్షువులు లేచి "సభ్యులారా! ఈమెను శిక్షించవద్దు. ఈమె నేరముచేయలేదు. మేము మాకోపముచేత చెడు తలంపుతో దబ్బాను అవమానించుటకు ఈమెను పురికొల్పితిమి" అని మెట్టీయ ముతాభిక్షువులు చెప్పుకొనిరి. అప్పుడు దబ్బా శుద్ధ నిర్దోషియని సంఘమువారు తీర్మానించిరి.

ఇంకొకపుడు వత్థ అనువాడు, యీమెట్టీయ భుమ్మజకుల స్నేహితుడు. వారల సమీపించి వందనము చేసెను. రెండు మూడు మారులు పలుకరించినను వారు పలుకరైరి. "పలుకని కారణమేమని ఆతడుఅడుగ దబ్బా తమను ఇబ్బంది పెట్టుచున్నాడనియు, ఆతనిని వెళ్ళగొట్టించవలయుననియు,"

వారు కోరిరి. ఉపాయమేమని వాడు అడుగగా "నీభార్యను దబ్బా చెరిచినట్లుగా బుద్ధునితో ఫిర్యాదుచేయుము" అని వారు సలహా చెప్పిరి. ఈ వత్థుడు అట్లే చేసెను. బుద్ధుడు మరల సభచేయించి దబ్బాను ప్రశ్నించెను. దబ్బా నొకటి వలెనే తన సత్ప్రవర్తనను రూఢిపరచెను. బుద్ధుడు ఈవత్థుని మీద చర్యజరుపుడు అని సంఘమువారితో చెప్పెను. ఈవత్థా ఉపాసకుడు. అనగా గృహస్థ శిష్యుడు. భిక్షుసంఘములకు భిక్షల నిచ్చుచు పరిచర్యలు చేయుచుండెడివాడు. ఉపాసకుడు ఎప్పుడయినను తప్పు జేసినయెడల భిక్షుసంఘము వానిపై కమండలములను బోర్లింతురు. అనగా వారియిండ్ల భిక్ష మొదలగునవి గైకొనరు. ఇట్టిశిక్ష తనకు విధింపబడినదని మరునాడు ఉదయమున ఆనందుని వలన వత్థా తెలుసుకొని అచటనే స్పృహతప్పి పడిపోయెను. వాని స్నేహితులు, బంధువులు నుచేరి "చాలుజాలు. ఏడ్వకుము. గోలపెట్టకుము. మనము భగవంతుని యొద్దకుబోయి ప్రసన్నుని జేసికొందము" అని సలహా చెప్పిరి. అంతట వత్థాయును, అతని భార్యాపిల్లలును, రక్తసంబంధువులును, స్నేహితులును, స్నానములుచేసి, విరియబోసిన జుట్లతో, తడిబట్టలతో బుద్ధుని చెంతకు వచ్చిరి.

వృద్ధుడు బుద్ధుని కాళ్ళమీదపడి పాపము నన్నులో బరచుకున్నది. నా మనోదుర్బలమువలన నామూర్ఖతవలన, నా అధర్మమువలన. నిష్కారణముగా దబ్బామీద నిందమోపితిని. నేను నాపాపమును పూర్తిగా మీయెదుట ఒప్పుకొనుచున్నాను. ఇకముందు యెన్నడును యిట్టిపనులు చేయను" అని వాడు బుద్ధునితో మనవి చేసుకొనెను.

వత్సా! మిత్రమా! నిజముగా పాపమునకు లోబడితివి. నీమనోదుర్బలము, నీ మూర్ఖత, నీయన్యాయము నిన్నుయిట్లునిష్కారణముగా దబ్బామీద అపనిందవేయుటకు పురికొల్పెను. కాని మిత్రమా! నీపాపము పాపమనిగ్రహించి తగినట్లు ప్రాయశ్చిత్తము చేసుకొంటివి గనుక నీపశ్చాత్తాపమును మేము అంగీకరించుచున్నాము. మిత్రమా! ఈసిద్ధాంతములో యున్న మేలు ఇదియే. ఎవడు తన పాపమును పాపమని గ్రహించునో, దానికి తగిన ప్రాయశ్చిత్తము చేసుకొనునో, వాడు పిమ్మట అట్టి పాపమునకును జొరబడక నిలుచుటకు శక్తిమంతుడగుచున్నాడు.

—•••—

## ఏనుగు, కోతి, తిత్తిరిపక్షి కథ

భిక్షు సంఘములో ఎవరుగొప్పయని ఒక నాడు ప్రశ్నవచ్చెను. జాతిచేత క్షత్రియుడగున భిక్షువు హెచ్చా? జాతిచేత బ్రాహ్మణుడయిన భిక్షువుహెచ్చా? ఈ మొదలగు ప్రశ్నలు పుట్టెను. కొందరు భిక్షువులు అందరిలో క్షత్రియ భిక్షువు హెచ్చుఅనిరి. కొందరు బ్రాహ్మణభిక్షువు హెచ్చు అనిరి. వైశ్య లేక గృహపతిజాతి భిక్షువులు హెచ్చుఅని కొందరు చెప్పిరి. కొందరు జాతిమాట యెత్తక సాధనలోని వరుసక్రమమును బట్టి హెచ్చుతగ్గులుచెప్పిరి. అప్పుడు బుద్ధుడు యీకథను చెప్పెను.

హిమవత్పర్వత సమీపమున ఒకమఱ్ఱిచెట్టు ఉండెను. దానిక్రిందను మూగ్గురు స్నేహితులు కాపురము చేయుచుండిరి. వారుముగ్గురును. 1 యేనుగ, 2. కోతి, 3. తిత్తిరి. తమలోతాము గౌరవమును. విశ్వాసమును లేకుండ కాలముగడుపుచుండగా వారికి ఒక ఆలోచన తోచెను. "మనలో ఈడులో ఎవరుపెద్ద అని తెలుసుకొని వానిని నా

యకునిగా చేసికొని నడచెదము” అని అనుకొనిరి. అంతట కోతియు, తిత్తిరియు, “నీకు ఎన్ని యేండ్ల నాటిసంగతులు తెలియును” అనియేనుగనడిగిరి. “నేను చిన్నవాడనై ఉండగా ఈ మఱ్ఱిచెట్టు నా తొడలవరకు వచ్చుచుండెడిది. అంతవరకే నాకు గుర్తుగలదు” అని ఏనుగచెప్పెను. తక్కినయిద్దరిలో కోతిని అడుగగా, “నేను చిన్నదానను నేల పాకులాడునపుడు ఈచెట్టుయొక్క చిగారుకొమ్మను పండ్లతో కొరుకుచుంటిని” అని చెప్పెను. అట్టిప్రశ్న తిత్తిరికి వేయగా అది ఇట్లు జవాబు చెప్పెను. “స్నేహితులారా! ఆ కనుచూపుమేరనమున పొక పెద్ద మఱ్ఱి చెట్టు వుండెడిది. దాని పండ్లను నేను తిని విత్తు నిక్కడ పారవేసితిని. ఆవిత్తన మీచెట్టు అయ్యెను. కావున మీయిద్దరికంటె నేనే పెద్దదానను.” ఆమాటలువిని ఏనుగును, కోతియును, “స్నేహితుడా! నీవే మనలో పెద్దవాడవు. నిన్ను గౌరవించెదము. నీ సలహాచొప్పున నడచెదము.” అని వానికిచెప్పి ఆ ప్రకారము నడుచుకొనిరి. ఆతిత్తిరి వీరలను సక్రమమార్గమున నడపెను. వారు ఈదేహములను విడిచినపిమ్మట ఉత్తమ గతులను పొందిరి. ఎవరు వయస్సులో పెద్దవారిని గౌరవింతురో వారే ధర్మమును తెలిసినవారు. వారున్ను ఇహపరముల

కీర్తిని సుక్షేమమును పొందెదరు. జంతువులు, పక్షులు కట్టు ప్రవర్తించుచుండుటచేత, మానవులు గూడ ఇట్లు నడచుట యుక్తమని బుద్ధుడు శెలవిచ్చెను. ఈ సంఘములో చేరినవారు వయసుచేత పెద్దలైన వారికే గౌరవ, మర్యాదలు చూపవలెను. కాని వయసునుబట్టి ఎవరును సంఘపు ఆస్తిని స్వీయముగా ఉపయోగించుకొనరాదు. అని బుద్ధుడు కట్టుబాటుచేసెను.

---

## అనిరుద్ధుని కథ.

శాక్యవంశజులైన అనిరుద్ధుడు, మహానాముడు అని యిద్దరు అన్నదమ్ములు గలరు. "బుద్ధభగవానులు మతబోధచేయ మొదలుపెట్టిన నాటనుండి మనశాక్యులలో చాలమంది యువకులు ఆయన ననుసరించి భిక్షువులయిరి. మన యింటనుండి ఎవరును భిక్షువులు కాలేదు. నేనో, అనిరుద్ధుడో భిక్షువులగుట మేలు. అని మహానాముడు తలచి తన సోదరునితో, నీవో, నేనో, భిక్షువు అగుదుము. గృహస్థములోనున్న వానికి గలుగుపనులు చూడుము. మొదట పొలమును దున్నించవలెను, తరువాత విత్తవలెను. తరువాత నీరుపెట్టవలెను. పిమ్మట నీరువెళ్ళగొట్టవలెను. తదుపరి కలుపుతీయవలెను. పైరుకోయవలెను. కోయించి కట్టగట్టి మోయించవలెను. నూర్పవలెను. తూర్పారబట్టి

గడ్డి పేరు చేయవలెను. ధాన్యమును పాతర్లుపోయవలెను. ఇది ఒకయేడు చేయు పనివరుస. ఇట్లే ప్రతియేడు చేయవలెను. దీనికి అంతు అగపడదు. మన తండ్రులు తాతలు చేసిరి. పూర్తిగాక మనకు వదలిరి. దీని అంతము జూచు టెన్నడోగదా! ఎన్నడు యింద్రియపటుత్వము తగ్గకముందే, విశ్రాంతి నొందగలము. అని అనిరుద్ధునితో చెప్పెను. అంతట అనిరుద్ధుడు తానే భిక్షువునగుదునని నిశ్చయించుకొని మహానామునితో చెప్పి, తల్లివద్దకు బోయి అనుమతి ఇమ్మని కోరెను. అయమ్మ మీయిద్దరే నా కుమాళ్ళు. మిమ్ము వదలి నే జీవించజాల. నేను బ్రతికియుండగా నీవు భిక్షువగుటకు అంగీకరించను అని ఆయమ వానితో చెప్పెను. వాడు, మరిమరి బ్రతిమాలగా, మనరాజు భద్రియుడు సన్యసించిన యెడల నీవును పొమ్ము అనిఆమె చెప్పెను. ఆరాజు ఇల్లువదలడని ఆమెనమ్మెను. అంత అనిరుద్ధుడు, భద్రీయుని యొద్దకు బోయెను. "మిత్రమా! నేను ప్రపంచమును త్యాగముచేయవలయునని యున్నది. ఆ త్యాగమునకు నీవు అడ్డుతగులు చున్నావని అనిరుద్ధుడు రాజుతో చెప్పెను. అట్లయినయెడల ఆ అడ్డును తొలగించుము. నేనుకూడ నీయిష్టప్రకారము చేసెద. నీవు త్యజింపుము అని రాజుచెప్పెను. రమ్ము. స్నేహమా! మనమిద్దరము వదలెదము అని అనిరుద్ధుడు పురికొల్పెను. నేను ఇల్లు వదలిపెట్టలేను. ఇంకేదయినను కోరుము చేసెదను. నీవొక్కడవే పొమ్ము అని రాజు మరల చెప్పెను. అంత అనిరుద్ధుడు తన తల్లికిని, తనకును జరిగినమాటలను జెప్పి, రాజా! నీవు మొదట నాతో చెప్పిన వాక్యములలో నీవుకూడ నాతో లోకమును త్యజిం

తునని చెప్పియుంటివి. అట్లుచెప్పి ఇప్పు డెట్లు మారెదవు? అని అనిరుద్ధుడు రాజును యిరుకునబెట్టెను. ఆ కాలమునాటి ప్రజలు నిజము మాట్లాడుచుండిరి. మాట తప్పెడివారు కారు. అందుచేత రాజు నేనును రాజ్యమును త్యజించి నీతోగూడ భిక్షువు నయ్యెదను. కాని యేడు యేండ్లు ఆగుము. ఇద్దరము కలసి పోవుదము. అని వాయిదా కోరెను. అనిరుద్ధుడు దానికి సమ్మతించలేదు. అంతట యేండ్లనుండి నెలలకును, నెలలనుండి పక్షములకును వాయిదాలు కోరెను. దీనికిని అనిరుద్ధుడు సమ్మతింపడయ్యె. చిట్టచివరకు నారాజ్యము, నా కుమాళ్ళకును, నా సోదరులకును ఒప్పగించుటకు యేడురోజులు వాయిదా నిమ్మని రాజు కోరెను. అనిరుద్ధుడు అందులకు ఒప్పుకొనెను.

ఆ వారము గడచెను. భద్రీయుడును, అనిరుద్ధుడును, ఆనందుడును, భాగుడును, కించిలుడును, దేవదత్తుడును, వీరల మంగలి ఉపాలియును బయలుదేరిరి ఈ మొదటి ఆరుగురును శాక్యవంశపు క్షత్రియులు. వారు అప్పుడప్పుడు ఆటపాటలకు వేటలకు చతురంగ సేనలతో పోవుచుండిరి. అట్లే ఇప్పుడును పరివార సహితముగా బయలుదేరిరి. కొంతదూరముపోయి దాణువను వెనుకకు పంపిరి. మరికొంతదూరము పోయి తమ నగలనుతీసి బట్టలలో మూటగట్టి ఉపాలికి యిచ్చి నీ జీవనమునకు ఇవి చాలును. వెనుకకు పొమ్ము అని వానిని మరల్చిరి. ఈ ఉపాలి కొంతదూరము వెనుకకు బోయెను. ఈ శాక్యులు క్రూరులు. నేను నగరమునకు పోయిన యెడల నన్ను వారు చంపుదురు. ఇంతమంది శాక్యయువకులు భిక్షువు

లగుచుండగా నే నేల కాగూడదని ఉపాలి యోజించుకొని తనకిచ్చిన మూటను ఒకచెట్టుకు గట్టి, ఎవరికి దొరికితే వారు దీసుకొందురుగాక అని పలికి తిరిగి క్షత్రియ కుమారు లున్నచోటికి వచ్చెను. వీనిని చూచి నీవేల తిరిగి వచ్చితివి అని ఆమంగలి నడిగిరి. వాడు తన మనస్సు లోని సంగతి చెప్పెను. వారు ఆమోదించిరి. ఉపాలిని తమతోగూడ బుద్ధభగవానుని యొద్దకు తీసుకొని పోయిరి. బుద్ధు కు నమస్కరించి ప్రక్కన కూర్చుండి బుద్ధునితో యిట్లు మనవి చేసిరి. "ప్రభో! మేము శాక్యులము. గర్వము గలవారము. ఈ మంగలి మాకు చాలకాలము సేవ చేసెను, వానికి మాకంటె ముందుగా దీక్షనిప్పించుడు. మేము అప్పుడు వానిని పెద్దగానెంచి సాష్టాంగ పడెదము. అప్పుడు మాగర్వ మణిగిపోవును." అని వీరువిన్నవించి వీరి కోరిక ప్రకారము మొదట ఉపాలి కిని, తరువాత శాక్యులకును బుద్ధుడు దీక్షనిచ్చెను, కొన్నినెలలు గడుచులోపల వారివారి యోగ్యతలనుబట్టి వారికి సాధనలు అభివృద్ధి గలిగెను. అనిరుద్ధునకు అహంకార మును, అనుమానమును, కర్మ కలాపములందు విశ్వాస మును— అను మూడు భ్రమలు తొలగిపోయెను.

బాలక గ్రామమునందు, పూజ్యులయిన అనిరుద్ధు డును, నందీయుడును, కించిలుడును, చాతుర్మాస్యలు గడుపు చుండిరి. ఆ సమీపముననున్న బుద్ధుడు వారలను చూడవచ్చెను. వారల తోటమాలి బుద్ధుని లోనికి రావద్దని చెప్పుచుండ అనిరుద్ధుడు విని, తోటమాలినిమందలించి, తన సోదరులను పిలుచుకొని, బుద్ధుని యొద్దకు సమీపించి, వారికి నమస్కరించెను. ఒకడు బుద్ధుని కమండలమును

గైకొనెను. ఒకడు పైవస్త్రమును తీసెను. ఒకడు పీట వేసెను. ఒకడు కాళ్ళుకడుగుకొనుటకు నీళ్ళను. కాళ్ళు బెట్టుకొనుటకు మరొక పీటయు, తుడుచుకొనుటకు తువాలును తెచ్చి ఇచ్చెను. ఆ పీటపై బుద్ధుడు కూర్చొని కాళ్ళు కడుగుకొనెను. ఈ ముగ్గురును నమస్కరించి ప్రక్కన కూర్చుండిరి. మీరు ముగ్గురును చక్కగా కాలము గడుపుచున్నారా? భిక్ష సరిగా జరుగుచున్నదా? అని బుద్ధుడు వారల నడిగెను. ఏలోపమును లేదని వారు జవాబు చెప్పిరి. మీరు ఐకమత్యముతో, స్నేహభావముతో, నీరు— పాలవలె కలసి మెలసి ఉందురా? అని బుద్ధుడు అడుగ, నిశ్చయముగా అట్లే జరుగుచున్నదని వారు బదులు చెప్పిరి. మీరు ఎట్లు ఐకమత్యమును సంపాదించితిరి అని బుద్ధుడు మరల ప్రశ్నించెను. దానికి వారు ఒకరి తరువాత నొకరు ఇట్లు జవాబు చెప్పిరి. ఇట్టి సోదరుల సాంగత్యముతో జీవించుట నాకు పూర్తిగా లాభకరము. నాకు పూర్తిగా ఆనందకరము అని నేనెంచెదను. అట్లు యెంచి రహస్యముగాను, బహిరంగముగాను, నా పనుల అన్నిటిలో వారల ఎడ సఖ్యత (చెలిమి) చూపెదను. అట్లే నా మాటలలోను, నా యోచనలలోను, చెలిమిని నిలిపెదను. నా కోరికనువీడి ఈ పూజ్యులయిన సోదరుల కోరిక ప్రకారము ఎందుకు నడువరాదు అని ఆలోచించి అట్లే చేయుచుండెదను. మా శరీరములు వేరుగాని, మనస్సులు ఒక్కటే అయినవి. ఈ మాటలు వినిన పిమ్మట బుద్ధుడు మరల యిట్లు ప్రశ్నించెను. మీరు నిష్ఠతోను, భక్తితోను, శ్రద్ధతోను, స్థిర చిత్తముతోను మెలగుచున్నారా? దానికి అట్లే జరుగుచున్నదని వారు బదులుచెప్పి, తాము అవ

లంబించు పద్ధతిని ఇట్లు వర్ణించిరి. మేము ముగ్గురమును గ్రామములోనికి భిక్షకుపోవుదుము. ఎవడు ముందుగా వచ్చునో వాడు పీటవేయును. కాలి పీటలు, తువాళ్ళు, వాడుకనీరు, మురికినీరు ఉంచుపళ్లెము తెచ్చి ఒకచోట పెట్టును. మంచినీళ్ళు, అన్నము వడ్డించును. చివరకు వచ్చినవాడు, తాను తినగోరినయెడల మిగిలిన అన్నమును తినును. లేని యెడల యీ అన్నమును తీసిపారవేయును. పీటలు మొదలయినవి తీసి కడిగి శుభ్రము చేసి, ఎక్కడి వక్కడ ఉంచును. కుండలను, కుర్చీలను అమర్చును. ఒకడు తియ్యలేని యెడల రెండవవానిని పిలుచును. ఈపనులను గురించి మాకు మాటాపలుకు లేనేలేదు. అయిదు రోజుల కొక్కమారు ఒక రాత్రియంతయు నిద్రలేకుండ కూర్చొని మత విషయమై మాట్లాడుకొనుచు, బోధించుకొందుము. ఇట్లు మాజీవితము శ్రద్ధాభక్తులతో, స్థిరబుద్ధితో, సరళముగా జరుగుచున్నది అని వారు బుద్ధునికి ఎరుక పరచిరి. బుద్ధుడు వారలకు ధర్మసంభాషణ వినిపించి మరింత ఉత్సాహము, సంతోషము కల్పించెను.

---

## దేవదత్తుని కథ

దేవదత్తుడు శాక్యజాతికి చెందిన క్షత్రియకుమారుడు. ఈతడు అనిరుద్ధునితోపాటు భిక్షువ

య్యెను. ఈయన చేసిన సాధనమువల్ల కొన్ని కొన్ని అణిమాదిశక్తులను సంపాదించినట్లు కనుపడును. (ఈ దేవదత్తుడును, బుద్ధుడును బాల్యమునందు ఆటలాడుచుండగా ఆకాశమున బారులుగట్టి పోవుచున్న పక్షులలో నొకదానిని ఇతడు బాణముచేత పడగొట్టెను. దానిని బుద్ధుడు తీసుకొని, దాని రెక్కలను పరీక్షించి అలుగును తీసి దానికి కొంత సేవచేసి బాధ తగ్గించెను. దేవదత్తుడు ఆపక్షి తనదని వాదించెను. ప్రాణము హరింపజూచిన దేవదత్తునికి యీ పక్షిని యివ్వరాదనియు, ప్రాణము రక్షించిన తనకే అది రావలయుననియు బుద్ధుడు చెప్పెను. ఈ తగవు వారలకు తీరక వారు రాజ సభకు పోయిరి. ప్రాణదాతకే హక్కుగలదని సభ వారు తీర్మానించిరి. అంతట బుద్ధుడు దానికి బాధ తీరువరకు పోషించి పిమ్మట వదలివేసెను. ఆబాణముయొక్క అలుగును బుద్ధుడు తన శరీరములో గుచ్చుకొని ఆ పిట్టకుకలిగిన బాధను తాను స్వయముగా తెలుసుకొనెను.)

దేవదత్తుడు ఒకనాడు ధ్యానములోనుండగా నేను యెవరిని స్నేహితునిగా జేసుకొనిన ఎడల నాకు అధికముగా లాభమును, కీర్తియును, గౌరవమును కలుగును, అను ఆలోచనతోచెను. అం

తట మగధయువరాజు అయిన అజాత శత్రుని పేరు అతనికిఁదోఁచెను. ఈతడు అజాతశత్రువునుకలిసి స్నేహముచేసెను. అజాతశత్రుడు ఇతనిని మిక్కిలి ఆదరించెను ప్రతిఉదయము, సాయంత్రము ఐదువందల భిక్షువులకు సరిపోయిన ఆహారమును దేవదత్తునికి యాతను పంపుచుండెను. ఇట్లు జరుగుచుండ కీర్తికాంక్ష పెరిగెను. భిక్షుసంఘమున కంతకును నాయకుడుకావలెనను కోరిక పుట్టెను. యీసంగతి మొగ్గల్లానాఅను బుద్ధుని శిష్యుడొకడు గ్రహించి బుద్ధునితో చెప్పెను. దీనిని నీమనసునందే యుంచుకొనుము. ఆ మూర్ఖుడు తనంతట తానే బయటపడును అని బుద్ధుడతనికి సమాధానము చెప్పెను. మొగ్గల్లానాతో బుద్ధుడు లోకస్థితినిగూర్చి యిటులపలికెను. ఈ లోకములో అయిదు తరగతుల బోధకులు గలరు. ఒకడు సత్ప్రవర్తన లేనివాడు. ఒకడు సరియైన ఆహారనీమము లేనివాడు. ఇంకొకడు సరియైన ధర్మము లేనివాడు. ఇంకొకడు సరియైన జ్ఞానము లేనివాడు. మరియొకడు సరియైన బోధనాశక్తిలేనివాడు. ఏయొక్క లోపమైనను గల గురువు, ఆయన శిష్యులును కలసి ఒండొరుల లాభము నిమిత్తము, తమతమ లోపములను కప్పిపుచ్చి ప్ర

పంచమును మోసగించవలసి యుండును. నాకు అయిదు లోపములును లేవు. నేను పవిత్రుఁడననియు, నిర్దోషిననియు, మాయామర్మము లేనివాడననియు, బహిరంగముగ ప్రకటించుచున్నాను. నా శిష్యులుగాని, యితరులుగాని నన్ను కాపాడనవసరము లేదు. అట్టి కోరికయును నాకు లేదు అని బుద్ధుడు చెప్పెను.

బుద్ధుడు కోశాంబినగరము వదలి, రాజగృహానగరమునకువచ్చెను, అచ్చటి భిక్షువులు దేవదత్తుని కీర్తినిగూర్చి బుద్ధునితో చెప్పిరి. దేవదత్తునిజూచి మీరు అసూయపడకుఁడు. అతడు అనర్హుఁడయిన యెడల దానివల్లనే అతను చెడిపోవును. అరటిచెట్టుగాని, వెదురుగాని, రెల్లుగాని పండుపండగానే చెడిపోవును. కంచరగాడిద ఈనగనే చనిపోవును. అట్లే చెడువానిని కీర్తినశింపజేయును అని బుద్ధుడు వారలను ప్రబోధించెను,

ఒకనాడు సపరివారుడయిన మగధరాజుతో కూడ ఒక పెద్ద సభ జరుగుచుండెను. ఆ నిండు కొలువులోకూర్చుండి బుద్ధుడు ధర్మమునుబోధించుచుండెను. అప్పుడు దేవదత్తుడు లేచి బుద్ధునికి నమస్కరించి, "మీరు ముసలివారైతిరి. చాల

దూరము జీవయాత్ర గడిపితిరి. చివర రోజులు వచ్చుచున్నవి. కాన మీరు విశ్రాంతి గైకొనుడు. నేను బుద్ధసంఘమునకు నాయకుడనై నడిపెదను" అని బుద్ధునితో విన్నవించెను. "చాలును. దేవదత్తా! నాయకత్వమును కోరకుము" అని బుద్ధుడు శెలవిచ్చెను. వాడు ఇటుల మరిరెండు పర్యాయములు కోరి అదేజవాబునుపొందెను. అంతట బుద్ధుడు "దేవదత్తా! నీవు దుష్టుడవు. నీకంటె శాలిపుత్ర మొగ్గల్లాలు శ్రేష్ఠులు. నీకి అర్హతలేదు" అని తెలుపగా దేవదత్తునకు బుద్ధునియెడ అసూయ జనించెను. అతను పగబట్టెను. రాజుయెదుట తనకు అవమానము జరిగెనని దేవదతునికి కోపమువచ్చెను.

దేవదత్తుని స్వభావము మారినదనియు, దేవదత్తుడు చెప్పుమాటలలోగాని, చేయు పనులలోగాని బుద్ధునకును, భిక్షు సంఘమునకును జవాబుదారీ లేదనియు, సంఘము వారు తీర్మానించిరి. ఆ తీర్మానప్రకారము రాజగృహనగరములో ప్రకటించవలసినదిగా శాలిపుత్రుని కోరిరి. మొదట దేవదత్తుడు గొప్పవాడనియు, మంచివాడనియు ప్రకటించితిని. ఇప్పుడు మరల నేనేబోయి అతడు చెడ్డవాడని ఎట్లు చెప్పుదును అని శాలిపుత్రుడు అను

మానించెను. “శాలిపుత్రా! మొదట నీవు నిజము చెప్పితివా? లేదా?” అని బుద్ధుడు అడిగెను. అప్పుడు నిజమే ప్రకటించితిని అని శాలిపుత్రుడు బదులు చెప్పెను. ఇప్పుడు నీవు ప్రకటించవలసిన సంగతి నిజమా? అబద్ధమా? అని బుద్ధుడు అడుగ ఇదియు నిజమేనని శాలిపుత్రుడు ఒప్పుకొనెను. నిజము నే మాట్లాడుచు దేవదత్తుని స్వభావమును ప్రకటించుము. అని బుద్ధుడు శాలిపుత్రుని సందేహమును తీర్చెను, అంత శాలిపుత్రుడును, కొందరు భిక్షువులును, నగరములో నలువైపులను దేవదత్తునిలో గలిగిన మార్పును యెరుకపరచిరి. కొందరునమ్మి దీనికి గొప్ప కారణముండునని తలచిరి. కొందరు దేవదత్తుని కీర్తికి ఓర్వ్వక ఇట్టిప్రకటన జరుపబడెనని యెంచిరి.

దేవదత్తుడు ఒకనాడు అజాతశత్రుని యొద్దకుబోయి “కాలములు మారినవి. ఆయుస్సులు తగ్గినవి, నీవు యీడు వచ్చినవాడవు, మీతండ్రి ఇంకను రాజ్యము చేయుచున్నాడు. నీవు రాజుగాకముందే చనిపోయెదవేమో? నీవు నీ తండ్రిని చంపి రాజవగుము. నేను గౌతముని చంపి బుద్ధుడ నగుదును” అని సలహాచెప్పెను. ఆ యువ రాజు దాని కంగీకరించెను. వాడొకనాడు కత్తిని

తొడదగ్గర దాచుకొని రాజు పరుండుగదిలోనికి పోయెను. అచటనున్నవారు, ఇట్లు వేళగాని వేళ వచ్చెడి వీనివైఖరిని జూచి అనుమానించి, సోదా చేసి, కత్తిని పట్టుకొనిరి. దీనికి కారణమేమని అడుగ మా తండ్రిని చంపుటకే నేను వెళ్ళుచున్నాను అని అతను జవాబుచెప్పెను. నిన్ను యెవరు పురికొల్పిరి అని అడుగ. దేవదత్తుడు అనిచెప్పెను. అప్పుడే అజాతశత్రుని చంపవలెనని కొందరు ఊహించిరి. కొందరు బుద్ధునిసంఘమును నిందించిరి. కొందరు దేవదత్తుని జంపదలంచిరి. కొందరు రాజునకు ఈసంగతిని యెరుకపరిచి వారు చెప్పినచొప్పున నడుచుకొండమనిరి. అందరునుకలసి అతనిని రాజుదగ్గరకు తీసుకొనిపోయిరి. నన్నేల చంపనెంచితివి అని రాజు వానినడిగెను. నేనురాజ్యమును కోరితిని అని వాడు చెప్పెను. నీకు కావలసినది రాజ్యమేకదా. ఇదిగో తీసికొమ్మని కిరీటము నిచ్చెను. అట్లు అజాతశత్రువు రాజయ్యెను.

దేవదత్తుడు ఈ క్రొత్తరాజుచెంతకు వచ్చి నేను గౌతముని చంపవలసియున్నది. కొందరు మనుష్యులను నేను చెప్పునది చేయునట్లుగా ఆజ్ఞాపించి నాకు స్తోమతునిమ్మని అని కోరగా రాజు

అల్లేచేసెను. అంతట దేవదత్తుడు తనవెంటవచ్చి వారలను అయిదు మూఠాలుచేసి మొదట ఒక్కని, తరువాత ఇద్దరిని, తరువాత నలుగురిని. తరువాత యెనిమిది మందిని, తరువాత పదహారు మందిని మూఠాలుగానుంచి కొన్నికొన్నిచోట్ల నిలిపెను. ప్రతి మూఠాకో మీరుపోయి బుద్ధునిచంపి ఈదోవన తిరిగిరండు అనిచెప్పెను. అట్లు తిరిగి వచ్చువారును చంపునట్లుకూడ ఏర్పాటు చేసెను. మొదటివాడొక్కడును, డాలును, కత్తిని, విల్లును అంబును తీసుకొని బుద్ధుడుండుచోటికి బోయెను. దూరమునుండియే బుద్ధునిచూచి వీనిదేహము వణకసాగెను. మనసు మారెను తాను కదలలేకపోయెను. అప్పుడు వీనిస్థితినిజూచిన బుద్ధుడు "స్నేహితుడా! ఇటు రమ్ము. భయపడకుము. అని" చెప్పెను. వాడు తన ఆయుధములను అచ్చటపెట్టి బుద్ధుని దగ్గరకుపోయి వారి కాళ్ళమీద పడి తాను వారిని చంపుటకు వచ్చిన సమాచారమును చెప్పెను. తననేరమును ఒప్పుకొనెను. పశ్చాత్తాపపడెను. ముందెన్నడును ఇట్టిపనిని చేయనని ఒట్టు పెట్టుకొనెను. బుద్ధుడు అతనిని క్షమించి ధర్మబోధచేసెను. వాడు బుద్ధుని శరణుజొచ్చి శిష్యుడాయెను. బుద్ధుడు అతనిని వాడువచ్చిన

మార్గమునగాక. మరియొకత్రోవను పంపివేసెను. వీరికై ఎదురు చూచుచున్న రెండవముఠా వీరు ఏలరాలేదని యోచించి తాము బయలుదేరివచ్చి బుద్ధుని దర్శించి, బోధలను విని, శిష్యులై, వారి ఆజ్ఞచొప్పున రెండవ మార్గమున వెళ్ళిపోయిరి. ఈవిధముగానే తక్కిన ముఠాలకును జరిగెను. మొదటివాడు దేవదత్తునిచేరి "బుద్ధుని మహిమ గొప్పది, నేను వానిని చంపజాలకపోతిని, ముందు ఎన్నడును చంపబూనను" అని చెప్పెను. అంతట దేవదత్తుడు ఆపనిని తానే స్వయముగా చేయబూనెను. ఒకనాడు బుద్ధుడు ఒక కొండదరిని ధ్యానములో నుండి, ఇటు నటు తిరుగుచుండెను. అది కనిపెట్టి దేవదత్తుడు కొండమీదికెక్కి, బుద్ధుని మీద పడునట్లుగా ఒకబండను దొర్లించెను. ఆబండ జారునప్పుడు ఇంకొకబండకు తగిలి బద్దలై ఒక చిన్నముక్క వచ్చి బుద్ధుని కాలికితగిలి నెత్తురుకారెను. సమాధినుండి లేచిన బుద్ధుడు పైకి దేవదత్తునివైపుచూచి, "అరే మూర్ఖుడా! ఎంతపాపము సంపాదించితివి. తథాగతుని చంపదలచి, వానినెత్తురు కార్చితివి" అని అనెను. అంతట తనను చూడవచ్చిన భిక్షువులతో, "ఈకర్మఫలితమును దేవదత్తుడు ఈజన్మములోనే అనుభవించు"నని

సూచించెను. కొన్ని కర్మల ఫలితము ముందు జన్మలోను, మరికొన్ని కర్మలఫలితము ఈజన్మలోను అనుభవించ వలసియుండునని వారిసిద్ధాంతము.

ఈ వార్తవినిన భిక్షువులు బుద్ధునివుండు విహారము చుట్టును కాపలాకాయుచు, బిగ్గరగా పాటలుపాడుచు, గట్టిగా మంత్రములు చదువుచుండిరి. బుద్ధుడు వారలను పిలిపించెను. అందరును కూర్చున్న పిమ్మట ఇట్లు బోధించెను. "భిక్షువులారా! తథాగతునియొక్క ప్రాణమును ఎవరును దౌర్జన్యముచేత తీయజాలరు, అది అసాధ్యము. తాముగాక ఏఇతరుడు మొదలిడిన పనివలనను తథాగతుడు చావబడడు. పండుపండి తథాగతుడు రాలిపోవును. తథాగతునికి ఏ కాపలాయును అక్కరలేదు కాన మీరు మీమీ గదులలోచేరి మీమీ పనుల చూచుకొనుడు"

రాజగృహ నగరములో నాలాగిరి అను ఒక ఏనుగు గలదు. అది క్రూరజంతువు, మనుజులను చంపును. దేవదత్తుడు మావటివాని వద్దకుబోయి "బుద్ధుడు ఈరస్తాను వచ్చును. వానిమీద దీనిని వదలుడు. మీకు జీతభత్యముల ఎక్కువ చేయించెదను" అని చెప్పగా ఆమావటివాడు సమ్మతించెను. ఒకనాటి ప్రొద్దున బుద్ధుడు కాషాయము

లను కట్టుకొని, కమండలము చేపట్టి, భిక్షువులతో కలసి భిక్షమెత్త బయలుదేరి ఆ త్రోవనే వచ్చుచుండెను. మావటీడు నాలాగిరి యను ఏనుగును బుద్ధుని మీద వదలెను. భిక్షువులు అందరును బుద్ధుని యొద్దకు పరుగెత్తి, "ప్రభో! తొలగుడు, మరలుడు" అని కేకలు వేసిరి. "భిక్షువులారా రండు పోదము. భయపడకుడు తొలగ నవసరము లేదు" అని బుద్ధుడు చెప్పి, ఆదోవనే పోవుచుండెను. భిక్షువులు ఎన్నిమారులు బ్రతిమాలినను, ఆయన వినడాయెను. పట్టణములోని ప్రజలు మిద్దెలమీదను మేడల మీదను ఎక్కి చూచుచుండిరి. ఈసుందరుడైన శ్రమణుడు (భిక్షువు అనగా బుద్ధుడు) ఈ యేనుగువలన చనిపోవునని కొందరుతలచిరి. మానవులలోని యేనుగ అయిన బుద్ధునితో ఆయేనుగ గెలువలేదని కొందరు యెంచిరి. ఇంతలో నాలాగిరి అనే యేనుగ బుద్ధుని చేరవచ్చె. బుద్ధుని ప్రేమరసము ఆ యేనుగమీద ప్రవహించెను. అది తొండమునువంచి బుద్ధుని యొద్దకువచ్చి నిలచెను. అప్పుడు బుద్ధుడు ఆయేనుగుతలపై తన కుడిచేతిని పెట్టి దానికి బోధించెను. "ఏనుగా! మానవులలోని యేనుగను తాకకుమా. అట్టివాడి దుఃఖమును కలిగించును. దానివలన ఎన్నడును ఆనం

దము కలుగదు. మదమున ప్రమాదమును ప్రా
దకమూ. ఇవి ఆనందమునకు అడ్డు తగులును.
నీవుగూడ ఆనందమును పొందుటకు తగినట్లు ప్రవ
ర్తించుము." ఆమాటలు వినిన నాలాగిరి అను యే
నుగ బుద్ధుని పాదములకింద దుమ్మును తొండము
తో నెత్తి, తన తలపై వేసుకొని బుద్ధునిపై దృష్టి
నిలిపి వెనుకకు నడచెను. అప్పుడు ఆపట్టణములోని
జనులు "కర్రలు, కొరడాలు, అంకుశములు లేకుండ
గనే, యీ మహానుభావుడు, యీ యేనుగను మ
చ్చిక చేసుకొనెను" అని వేనోళ్ళ పొగడిరి ఈ వ
ర్తలు అన్నిటికిని దేవదత్తుడే కారకుడు అని తెలుసు
కొని వానిపై ప్రజలు కోపమును బూనిరి.

అప్పుడు దేవదత్తుడు తిరిగి భిక్షుసంఘ
ములో చీలికలు కలుగచేయుటకు ప్రయత్నము చే
సెను. కోకాలికుడు మొదలగు వారిని చేర్చుకొని
కుట్రచేసెను. బుద్ధునికి ఈ ౫ అంశములతో సం
దేశము పంపెను. ౧ భిక్షువులు యెప్పుడును
అడవులలో యుండవలెనుగాని గ్రామముల దగ్గర
కయినను రాకూడదు ౨ ఎప్పుడును బిచ్చమెత్త
వలసినదేగాని, ఎవరిపిలుపును అంగీకరించి వారి ఇం
డలో భిక్ష తీసుకొనరాదు. ౩ ఎప్పుడును పారవేసిన
గుడ్డలనే కట్టవలెను. గాని ఉపాసకులు యిచ్చిన

దుస్తులను తీసుకొనరాదు. ౪. ఎప్పుడును చెట్టు మొదట నిద్రించవలసినదే కాని ఇంటికప్పుక్రింద తలదాచుకొనరాదు. ౫. వారు ఎన్నడును చేపలతినకుండుట మంచిది. ఈవింటిగో బుద్ధుడు చేయు తీర్మానము దేవదత్తునికి తెలియును. బుద్ధుడు వీనిని త్రోసివేసిన యెడల ప్రజలవద్దకువెళ్లి బుద్ధునిపై తిరుగుబాటు చేయించుటయే వీని అభిప్రాయము. దేవదత్తుడును, వాని మిత్రులును బుద్ధుని యొద్దకుబోయి యీ యంశములను చెప్పిరి. మొదటి మాటకిని బుద్ధుడు యిట్లు ప్రత్యుత్తరమిచ్చెను. ఇష్టమైన వాడు అడవులలో యుండవచ్చును. బిచ్చమెత్తవచ్చును. పారవేసిన పీలికల కట్టవచ్చును. "ఇష్టమైనవాడు గ్రామ సమీపమునందు ఉండవచ్చును. గృహస్థుల యిండ్లలో భిక్ష గైకొనవచ్చును. దుస్తులను, దానమును పట్టవచ్చును." చెట్టుక్రింద నివశించుటనుగూర్చి యెనిమిదినెలలు అట్లే భిక్షువులు నివసించుచున్నారనియు. వానాకాలములో నాలుగు నెలలు తలదాచుకొనక తప్పనిసరియనియు చెప్పెను. తనకయి పట్టబడినట్లు తాను చూడక, వినక, అనుమానించక యున్నవాడు చేపలను తినను, తినవచ్చును. అనిసూచించెను. (ఈ చేపలను తినుటను గూర్చి ఇది

బుద్ధుని అభిప్రాయము కాదనియు, తర్వాత వారు ప్రవేశపెట్టిరనియు, ఊహించుటకు తగిన కారణములు గలవు. పై షరతుల ప్రకారం తినినను, జీవహింస ప్రోత్సాహపరచబడును.) దేవదత్తుడు తాను అనుకొనినట్లు జరిగినదని సంతసించి రాజగృహానగరులో బుద్ధుని బోధకును, ఆచరణమునకును భేదము గలదనియు. తానును, తన స్నేహితులును, అత్యల్పముతో తృప్తిబొందుచుండ, బుద్ధుడు భోగమునకు అవకాశమిచ్చుచున్నాడనియు. ప్రజలయందు ప్రచారముచేసి దురభిప్రాయము పుట్టించ యత్నముచేసెను. ఈ సంగతి బుద్ధునికి తెలియగానే భిక్షువుల సంఘసభజరిపి దేవదత్తుని ఆసభలో "నీవు సంఘములో కక్షలు కల్పించుచుంటివా?" అని అడిగెను. దేవదత్తుడు తన ఉద్దేశ్యము నొప్పుకొనెను. "దేవదత్తా! చాలదూరము పోతివి. సంఘములో కక్షలు కలుగుట మేలుగా నీకు తోచకుండుగాక! అట్టికక్ష దుఃఖకరము. శాంతముగా నున్నసంఘము ఎవడు విభజించునో వాడు పెద్ద తప్పిదము చేయుచున్నాడు. కక్షలుగల సంఘములో ఎవడు శాంతిని నెలకొలుపునో వాడు ఉత్తమమయిన పుణ్యము చేయుచున్నాడు. దేవదత్తా! చాలును. ఇదివరకే చాలదూరము పో

తివి. చాలును" అని బుద్ధుడు చెప్పెను.

దేవదత్తుడు అంతటితో తృప్తిపొంద లేదు. మరునాడే ఆనందుడను, బుద్ధుని శిష్యునితో నేటి నుండి తానును, తన అనుచరులును వేరుగా సభలు జరుపుదురనియు, బుద్ధుని జోక్యము తనకు అవస రము లేదనియు చెప్పెను. రాజగృహనగరములో తన భిక్షను పూర్తిచేసుకొని, ఆనందుడు తిరిగివచ్చి బుద్ధునకు ఈవార్త తెలిపెను. "మంచివానికిమంచి పని తేలికయు, చెడువానికది కష్టమును అగును. చెడుపని చెడువానికి తేలికయు, ఉత్తములకు కష్ట మును అగును." అని బుద్ధుడు అప్పుడు వచించెను.

ఆ నాడే ఉపోసథమను వ్రతము జరుగుచుం డెను. తానును తన స్నేహితులును, బుద్ధునికి ఐదు సంస్కారణములు చేయుట అవసరమని తెలి పితిమనియు, కాని బుద్ధుడు అందుకు అంగీకరించలే దనియు, ఆమార్పుల ప్రకారమే తాముజీవితము లు గడుపు చున్నామనియు, ఆమార్పులను అంగీక రించువారెల్ల తనవద్ద సమ్మతిపత్రములను (ఓటిం గుచీట్లు) తీసుకొనవలెననియు దేవదత్తుడు ఆసభలో తెలిపెను. క్రొత్తగా భిక్షువులయిన ఐదు వందల మంది దేవదత్తుని ఉద్దేశ్యమును గ్రహించలేక అ తడుచెప్పినది ధర్మమేనని పొరపడి దేవదత్తునియొద్ద

చీల్లు తీసుకొనిరి. ఆ ఐదువందల భిక్షువులు దేవదత్తునితో వెడలిపోయిరి. ఈ సమాచారము బుద్ధునికి తెలిసెను. ఆ వెడలిపోయిన ఐదు వందలమంది భిక్షువులపై ఆయనకు కరుణ గల్గెను. వారు మోసపోయి పూర్తిగా నాశనముగాకముందు వారలకు నిజస్థితిని తెలుపుడని శాలిపుత్ర, మొగ్గలానలను బుద్ధుడు హెచ్చరించెను. వారు సరేనని యీ దేవదత్తుడుండు చోటుకు వెడలిరి. వీరు చేరునప్పటికి దేవదత్తుడు తన మతాకు బోధించుచుండెను. వీరిని చూచి తన సిద్ధాంతమును వీరుకూడా అంగీకరించిరనియు. తనతో చేరుదురనియు తలచెను. కాని వారికట్టి అభిప్రాయము కలుగదని, కోకాలికుడు దేవదత్తునితో చెప్పెను. దేవదత్తుడు వీరలను ఆదరించి శాలిపుత్రునకు తనఅర్ధాసనము యిచ్చెను. శాలిపుత్రుడు అది అంగీకరించక వేరొకచోట కూర్చుండెను. దేవదత్తుడు తనబోధ ముగిసినపిమ్మట శాలిపుత్ర మొగ్గల్లానలను బోధించమని కోరెను. వారు బోధ జేయుచుండ తాను నిద్రించెను. శాలిపుత్రుడు, మొగ్గల్లానాయును ధర్మము యొక్క ప్రభావము నుగూర్చియు, సాధనయొక్క మహిమను గూర్చియు బోధించిరి. వినుచుండిన వారలకు ధర్మము యొక్క నిజస్థితి తెలిసెను. జన్మమెత్తిన ప్రతివస్తు

నశింపక తప్పదని వారికి గోచరించెను. వారందరును
శారిపుత్ర మొగ్గల్లానల వెంట బుద్ధుని యొద్దకు
వచ్చి చేరిరి.

అచ్చట కోకాలికుడు దేవదత్తుని నిద్దురలే
పెను. శారిపుత్ర మొగ్గల్లానాలు ఐదువందల భి
క్షువులను తీసుకొని వెళ్ళిరని తెలిసి వారలను నిం
దించెను. దేవదత్తుడు అప్పుడే వేడినెత్తురు కక్కు
కొనెను. అప్పుడే అక్కడనే దేవదత్తుడు చనిపో
యెనని తరువాతగాథలు తెలుపుచున్నవి. ఈ
వచ్చిన ఐదువందలమంది భిక్షువులను తాము పొర
బడితిమనియు, తమ పొరబాటునకు చింతిల్లుచు
న్నామనియు బుద్ధునకు మనవిచేసిరి. వారి పశ్చా
త్తాపమును అంగీకరించి వారలను బుద్ధుడు సంఘ
ములో చేర్చుకొనెను.

"దేవదత్తుడు లాభమును, గౌరవమును, కీ
ర్తిని గోరెను ఆ కోరికలకు వాని మనసు లొంగి
పోయెను. దుష్టమైన కోరికలకును, దుష్టమైన
స్నేహితులకును, వాడు చిక్కెను. అందుచేత ఆ
తడు, బాధను దుఃఖమును పొందెను. ప్రతివాడును,
లాభమును నష్టమును. కీర్తినిఅపకీర్తిని. గౌరవమును
అగౌరవమును, అనువానికి లొంగక అతీతుడుకా
వలెను. దుష్టమైన కోరికలను దుష్టమైన స్నేహితు

లను విడువలెను. ఇట్లు విడువనివారికి ఆసవములు నశించవు. వారికి సాధన కష్టమగును. కాన వీటికి మీరు అతీతులయి సాధనచేయుడు. మనమందరము యీ యెనిమిదింటిపై సంపూర్ణమైన జయమును పొందవలెను. దేవదత్తుడు తాను బొందిన అల్పమైన, అణిమాది శక్తులతో గర్వించి, ఉన్నతమయిన అర్హత్వ లక్షణములును, నిర్వాణమును పోగొట్టుకొనెను. సముద్రమువలె అంతము లేనట్టియు, గంభీరమైనట్టియు, తథాగతునకు తన మాటలచే హాని చేయ యత్నించెను. కాని శాంతమైనట్టియు, సంపూర్ణమైనట్టియు తథాగతునిపై యీ మాటలు వృధాయయ్యెను." అని బుద్ధుడు భిక్షువులనెల్ల ప్రబోధించెను.

---

## సముద్రము కథ

---

ఒకనాడు భిక్షువులందరును శ్రావస్తీనగర సమీపమున విశాఖ కట్టించిన భవనములో సభ జేయుచుండిరి. బుద్ధుడచట నుండెను. ఆ సభయెదుట బోధించమని ఆనందుడు బుద్ధుని కోరెను. బుద్ధుడు మౌనము వహించెను. మరి, మరి, వేడగా "యీ సభ అపవిత్రమయినది ఆనందా!" అని

బుద్ధుడు చెప్పెను. అంత మొగ్గల్లానా యెవరిని గూర్చి వీరిట్లు చెప్పుచున్నారని యోజించి, సభ యంతయు కలయ వెదకి ఒకనివద్దకు వచ్చి, "అయ్యా లెమ్ము. బుద్ధుడు నిన్ను కనుగొనెను. ఇటనుండి వెడలుము." అని చెప్పెను. అతడు వినకపోగా మొగ్గల్లానా వానిని చెయ్యిపట్టుకొని బయటికి తీసుకొనిపోయి విడచివచ్చెను. అంతట బుద్ధుడు భిక్షువులతో యిట్లు ప్రసంగించెను. "భిక్షువులారా! మహా సముద్రములో విచిత్రమైన ఆశ్చర్యకరమయిన యెనిమిది గుణములు కలవు. ౧ సముద్రము పోను పోను మెల్లగా లోతగుచుండును. ఒక్కుననే అగాధముగా నుండదు. ౨ ఈ సముద్రము అచలమయి తన స్వభావమును వీడకుండును; ఎన్నడును చెలియలికట్ట దాటదు. ౩ ఈ మహాసముద్రము యెన్నడును శవముతో స్నేహము చేయదు. ఎప్పుడయినను ఒకశవము అందులోపడినయెడల దానిని వెంటనే ఒడ్డునకు నెట్టివేయును. ౪ గంగా, యమునా, అచిరవతి, శరభు, మహా, యిట్టినదులు అనేకములు యీ సముద్రములో పడగానే, వాని వాని పేర్లను, వంశనామములను, పోగొట్టుకొని సముద్రములో లీనమగును. ౫ ప్రపంచములో యెన్నినదులు వచ్చి ఈ సముద్రములో పడినను ఆకాశమునందలి వాన అంతయు దీనిలో కురిసినను. ఈ సముద్రము ఒక్కింత యయినను పొంగదు. ఒక్కింతయు తరుగదు. ౬ ఈ సముద్రమునకు ఒక్కటే రుచి. ఉప్పగా నుండును. ౭ ఈసముద్రములో రత్నములు, వజ్రములు, వైడూర్యములు, ముత్యములు, వెండి, బంగరు మొదలగునవి యుండును. అయ్యది రత్నగర్భ. ౮ తిమి, తిమింగలము, తిమి తిమి

గిలము. అసురులు, నాగులు. గంధర్వులు మొదలగు మ
హరాజులు యిందులో ఉందురు. అట్లే యీధర్మములో
యెనిమిది అత్యద్భుతము లయిన సుగుణ సంపదలుగలవు.
౧. సముద్రమువలెనే ఈ ధర్మము వరుసక్రమేణ, సాధ
నముపెంచి మెట్టు మెట్టుగా సాధకుని ఉన్నతస్థితికి తీసు
కొని పోవును. ఉగుడుదుకు యెన్నడును లేదు. ౨.
సముద్రమెట్లు అచలముగా వెలియలికట్ట దాటదో అట్లేనేను
చేసిన నియమములను నా శిష్యులు దాటరు. ౩. సముద్ర
ములో శవమెట్లు నిలువదో అట్లే దుష్టుడు నా మతములో
నుండ నేరడు. శీల ప్రవర్తనలు చెడినవాడుగాని, అను
మానించ దగినవాడు గాని, కామములతో నిండియుండిన
వ్యర్థుడు గాని యీ సంఘములో నిలువజాలడు. సంఘము
మధ్య కూరుచున్నను, వాడు సంఘమునకు దూరుడే.
౪. మహానదులు వచ్చి సముద్రములో పడి తమపేరు ప్ర
ఖ్యాతుల నెట్లు కోలుపోవునో, నాలుగు వర్ణములవారును
బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులందరును ఈ దీక్షను
గైకొనగానే తమ కులములను, పేర్లను విడనాడి శాక్యపు
త్రీయ శ్రమణులగుదురు. (శాక్యపుత్రుడగు బుద్ధునిచే
బోధింప బడిన శ్రమణులు అనేక సన్యాసులు) ౫. ప్రపం
చములోని నదులన్నియును, ఆకాశములోని వాన అంత
యును, సముద్రములో చేరినను హెచ్చు తగ్గులెట్లు
లేవో, అట్లే యెంతమంది భిక్షువులు వచ్చినను, యెంత
మంది భిక్షువులు పోయినను యీ సంఘమునకుగాని, ధర్మ
మునకుగాని, లోపము రానేరదు. ౬. సముద్రమునకు
ఎక్కడ చూచినను యెప్పుడు చూచినను యెట్లు ఒకేరుచి
గలదో, అట్లే యీ ధర్మమునకును, యీ సాధనమునకును.

ఒకేరుచికలదు. అదియే విమోచనరుచి. స్వాతంత్ర్యరుచి.
మోక్షరుచి. ౭. సముద్రములో ముత్యాలు వజ్రాలు వైడూర్య
ములు గలవో అట్లే యీధర్మములో నాలుగు ధ్యానములు,
నాలుగు పంథాలు, ఐదు నైతిక యింద్రియములు, ఏడు
జ్ఞానములు, మొదలగు రత్నములు గలవు. ౮. ఎట్లు
సముద్రములో తిమి తిమింగలములు మొదలగు మహాకా
యులు గలరో అట్లే యిందులో బుద్ధులు, బోధిసత్వులు,
అర్హతులు మొదలగు మహానుభావులు గలరు. ఈ లక్ష
ణము లన్నిటిని తెలిసికొని భిక్షువులందరును యీ సిద్ధాంత
ములోను, యీ సాధనములోను ఆనందింతురు.

---

## మహాప్రజాపతి గౌతమి కథ

---

ఆకాలములో బుద్ధుడు కపిలవస్తు నగరమున
మఱ్ఱివనములో నుండెను. ఆయనను పెంచి పెద్ద
వానిని చేసిన సవతితల్లి ఆయన వద్దకువచ్చి నమ
స్కరించి ఒకవైపున నిలుచుండి యిట్లు మనవి
చేసెను. "తథాగతులు ప్రకటించుచున్న సిద్ధాంత
సాధనములలోనికి స్త్రీలనుకూడ గృహస్థాశ్రమము
విడిపించి భిక్షుణులుగా చేర్చుకొనిన యెడల బా
గుండును ప్రభో!" ఆమాటలువిని, "గౌతమీ!

చాలును. స్త్రీలకు యిట్టి అనుమతి నిమ్మని ఆ డుగు కోరిక నీకు కలుగకుండుగాక ” అని బు దుడు చెప్పెను. కాని గౌతమి తృప్తి నొందక రెండవమారు, మూడవమారు అట్లే వేడుకొనెను. బుద్ధుడు మొదటి మాటలనే మరల చెప్పెను. అంతట గౌతమి బుద్ధునికి ప్రదక్షిణముచేసి కన్నీ ళ్ళు కార్చుచు వెడలిపోయెను.

కొన్నాళ్ళకు బుద్ధుడు వేసాలీ నగరసమీ పమున మహావనములో ఉండెను. అప్పుడు మ హాప్రజాపతి గౌతమియును, శాక్యస్త్రీలు కొంద రును, తమ వెంట్రుకలను కత్తిరించి కాషాయము లనుకట్టి, కాలినడకన బయలుదేరి, . పుండు బడిన కాళ్ళతో, దుమ్ముకప్పిన మొగములతో, నీరుకారిన కండ్లతో శోకమూర్తులవలె మహావన ముదొక్క సింహద్వారము వద్దకువచ్చి నిలువ బడిరి. వారలనుచూచి ఆనందుడు “మీరేల యిట్లు దిగాలపడి నిలిచితిరని గౌతమిని” అడిగెను. ఆనందా! బుద్ధభగవానులు మేము భిక్షువులు అగుటకు సమ్మతించలేదు గదా! మేము యేమి చేయుము” అనిరి. అంతట ఆనందుడు బుద్ధుని యొ ద్దకుచేరి, ఈ స్త్రీల సమాచారముచెప్పి వారు కోరినట్లు అనుమతించ వలెనని వేడుకొనెను. “ఆ

నందా! చాలు. స్త్రీలను చేర్పవలెనను కోరిక నీకు గలుగకుండుగాక" అని బుద్ధుడు సెలవిచ్చెను. ఆనందుడు మరి రెండుమారులు అడిగి ఇట్టి జవాబునే పొందెను. అప్పుడు వానికి మరియొక ఆలోచన తోచెను. "ప్రభో! గృహస్థ జీవితమునువిడిచి భిక్షుమార్గమును త్రొక్కిన స్త్రీలకు సంస్కార ఫలితము దక్కునా? అర్హతులుగాని, బోధిసత్వులుగాని, బుద్ధులుగాని కాగలరా" అని ఆనందుడు బుద్ధుని ప్రశ్నించెను. వారికాశక్తి కలదని బుద్ధుడు చెప్పెను. "ప్రభో! అట్టిశక్తి యున్నయెడల తమకు పసితనమునుండి అధికముగా సేవచేసిన గౌతమికి ఈ అనుమతి నిచ్చుట మంచిది" అని ఆనందుడు సూచించెను. అప్పుడు బుద్ధుడు స్త్రీలకు దీక్షనిచ్చుటకు సమ్మతించి కొన్ని నియమముల నేర్పరచెను. ౧ భిక్షువులైన స్త్రీలు వయస్సుతో నిమిత్తములేకుండ భిక్షువులైనపురుషులను గౌరవించవలెను. ౨ పురుష భిక్షువులు లేని జిల్లాలో ఆడ భిక్షువులు చాతుర్మాస్యలు జరుపరాదు. 3 భిక్షుసంఘములో జరుగు కొన్నిపనులనుగూర్చి ప్రత్యేకవిధులు యేర్పరచబడెను. ౪ స్త్రీలు భిక్షువులు కాగోరినయెడల రెండు సంవత్సరములు తరఫీయతు కావలెను. పురుషభిక్షులను ఆడభిక్షువులు నిందించరాదు. ఈ నియమములు

యేర్పరచ బడినట్లు ఆనందుడు గౌతమికి తెలిపెను. ఆమె ఈనీమములన్నిటిని శిరసావహించెను. మొట్టమొదట బుద్ధుడు యేర్పరచిన నీమములను కొన్నిటిని పిమ్మట బుద్ధుడే మార్చెను. ఈ సందర్భమున బుద్ధుడు యిట్లు ఆనందునితో చెప్పెను. "ఆనందా! ఈ దీక్షలోనికి స్త్రీలు భిక్షువులై చేరకుండినయెడల ఈ మతము వేయి సంవత్సరములవరకు పవిత్రముగా, స్థిరముగా నుండెడిది. కాని ఇప్పుడు స్త్రీలు భిక్షువులు అగుట అనుమతించ బడినది గనుక ఈ ధర్మశాసనము అయిదువందల సంవత్సరములవరకు నిలుచును. ఇట్లు అనుమతి నిచ్చుటవలన చిక్కులుగలుగకుండుటకై నిమముల నేర్పరచితిని." అని బుద్ధుడు చెప్పెను.

మొట్టమొదట మహాప్రజాపతి గౌతమి దీక్షను పొందెను. తరువాత ఆమెతో వచ్చిన స్త్రీలందరికి దీక్ష ఇవ్వబడెను. స్త్రీలకును, పురుషులకును, సమానమయిన నీమములలో ఉభయులు సమానముగా వర్తించవలెననియు, ఎవరి ప్రత్యేక నియమములో వారు ప్రత్యేకకృషి జరుపవలెననియు బుద్ధుడు నియమించెను. స్త్రీ భిక్షువుల సంఘము వేరుగను, పురుష భిక్షువుల సంఘము వేరుగను ఏర్పరచెను. ఒకనాడు గౌతమి ధ్యానముచేయుటకు

సాధనచూపుమని బుద్ధుని కోరెను. అప్పుడు బుద్ధుడు ఆమెకు ఇట్లు బోధించెను. "గౌతమీ! దేనివలన ఉద్రేకము కలుగునో, కోరికలు పెరుగునో, గర్వము పుట్టునో, జనులమధ్య నుండవలెనని కోరిక ఉదయించునో, సోమరితనము ఏర్పడునో, తృప్తిగలుగదో, అది ధర్మముగాదు. వినయమును కాదు. తథాగతుని బోధయు కాదు." అని జ్ఞాపకము ఉంచుకొనుము. "ఉద్రేకమునకు బదులు శాంతియును, గర్వమునకుబదులు పూజ్యభావమును, అమితకోరికలకుబదులు అల్పకోరికలును, గుంపులో నుండుటకు బదులు ఒంటరిగా నుండుటయును, ప్రమాదమునకు బదులు శ్రద్ధానిష్ఠలును, అతృప్తికిబదులు తృప్తియును, దేనివల్లకలుగునో అదియే వినయము. అదియే ధర్మము. అదియే తథాగతునిబోధ అని మనసు స్థిపరచుకొనుము." ఆ ప్రబోధమును విని గౌతమి మిక్కిలి సంతసించెను.

భిక్షువులగు స్త్రీలుగాని, పురుషులుగాని, నియమములకు భిన్నముగా నడచినఎడల వారలకు ఒకే విధమయిన ప్రాయశ్చిత్తము ఏర్పరుచబడెను. స్త్రీసంఘము తరఫున గౌతమియే, బుద్ధునియొద్దకు వెళ్ళి కష్ట సుఖములను చెప్పుచుండెడిది. స్త్రీలందరును, పురుషులవలెనే భిక్షువులు కాగానే

పొద్దుకట్టుట, ఋతువుల నిర్ణయించుట, తిధుల గుర్తించుట, చంద్రుని గమనమును గ్రహించుట మొదలగునవి నేర్చుకొనవలసి ఉండెను. స్త్రీలును పురుషులవలె వినయమును, ధర్మమును, సూత్రములను చదువుచుండిరి. ఒకనాడు రెండుకక్షలుగా ఏర్పడిన భిక్షువులయెడ తానెట్లు ప్రవర్తించవలెనని గౌతమి బుద్ధునిట్లడిగెను. "ఇద్దరును చెప్పెడి ధర్మమును వినుము. అది వినినపిమ్మట ఇందులో ఎవరి అభిప్రాయములు విశ్వాసములు సిద్ధాంతములు, వినయమునకు, ధర్మమునకు అనుకూలముగా నుండునో, వారి పక్షమును అంగీకరించుము. మీకు కావలసిన సాయమును వారివలననే పొందుము" అని బుద్ధుడు ఆమెకు ఆనతిచ్చెను.

బుద్ధుడు సిద్ధిబొందిన పిమ్మట రాజగృహ నగరములో ఐదువందలమంది భిక్షువులు ఒకమహా సభ చేసిరి. అందులో బుద్ధుడు చెప్పియున్న వినయమును, ధర్మమును స్థిరపరచిరి. ఆ సభలో ఈ గౌతమిని, ఇతర స్త్రీలను భిక్షువులుగా చేర్చినందుకు, ఆనందునిపై కొందరు కోపపడిరి. అది తప్పుఅని ఒప్పుకొమ్మనిఅని, ఆనందుని కోరిరి. అప్పుడుఆనందుడు ఇట్లు జవాబుచెప్పెను. "ఆస్త్రీలకై నేనుఅనుమతిని పొందుటకు కారణమున్నది. భగ

వంతుడయిన బుద్ధునితల్లి చనిపోగా ఆమెచెల్లెలు మహాప్రజాపతిగౌతమి ఆయనకు దాదియై, తల్లియై చనుబాలుఇచ్చి పెంచి పెద్దవానిని చేసెను. ఆమె బుద్ధునికిచేసిన సేవయును, దీక్షపొందుటకు గల భక్తిని గ్రహించి నేను ఆమెకై సమ్మతిని వేడితిని. అందులో తప్పిదము ఏమియులేదు. కాని పెద్దలగు మీరందరును తప్పని ఎంచిన ఎడల నేను తప్పని ఒప్పుకొందును. ఆనందుడు ఇట్లు చెప్పిన మీదట అంతటితో ఆవిషయమును ఆపిరి. కాని స్త్రీలకు మాత్రము క్రొత్తనిషేధములను ఏమియు యేర్పరచ లేదు.

---

## —అనాథపిండికుని కథ—

---

రాజగృహనగరములోని పెద్దశ్రేష్టికి ఒకచెల్లెలు ఉండెను. ఆచెల్లెలును శ్రావస్తీనగరములోని అనాథపిండికునకు ఇచ్చిరి. ఒకనాడు అతడు అత్తవారి యింటికి వచ్చెను. ఆనాడు తన బావమరది పనుల తొందరలోనుండి ఇతనితో చాలసేపు కులా

సాగా మాటలాడ వీలుపడలేదు. ఎప్పుడు అనాథపిండికుడు వచ్చినను ఈ పెద్దశ్రేష్ఠి అన్నిపనులను వదలి అతనితో కాలము గడుపుచుండును. నేడు అట్లు జరుగకుండుటకు కారణమేమి. ఇతనియింట పెండ్లిజరుగునా, యాగము జరుగునా, మగధ రాజును విందునకు పిలిచెనా అని తనలోతాను అనుకొన జొచ్చెను. ఇంతలో పెద్దశ్రేష్ఠి ఎవరిపనులను వారలకు జెప్పి అనాథపిండికుని వద్దకువచ్చి ఆదరించెను ఏమి తొందరలో నున్నావు. పెండ్లియా, యాగమా, రాజునకు విందా అని అడుగగా, పెండ్లి ప్రశంస లేదనియు, రాజును పిలువలేదనియు, కాని ఒకయాగము తలపెట్టితిననియు, అతను చెప్పెను. భిక్షుసంఘమును వారిగురువగు బుద్ధుని రేపు మాయింటికి భిక్షకు పిలిచితిని, అని పెద్ద శ్రేష్ఠి చెప్పెను. అనాథపిండికుడు త్రుళ్ళిపడి ఏమి! బుద్ధుడు అంటివా అని అడిగెను. ఔను బుద్ధుడు అనే అంటిని, బుద్ధునినే పిలిచితిని. అని శ్రేష్ఠి చెప్పెను. ఈ ప్రపంచములో బుద్ధుడు అను పదమువినుట కష్టమే. అట్టివాడు ఒకడుండి ఆయన స్వయముగా మీయింటికి భిక్షకువచ్చుట, ఎంత అదృష్టము. నేను ఇప్పుడేపోయి ఆ అర్హాతుని, ఆభగవంతుని, ఆస్వయం బుద్ధుని, చూచె

దను. అని అనాధపిండికుడు ఆతురపడెను. కాని ఇది వేళకాదనియు, తెల్లవారగానే పోవచ్చుననియు, శ్రేష్ఠి వీనికి తెలిపెను. అనాధపిండికునకా రాత్రి నిద్రయే పట్టలేదు తెల్లవారినదని ముమ్మారు లేచెను. కాని ఇంకను చీకటిగుండెను. చివరకు తెల్లవారునప్పుడు లేచి తాను ఒక్కడే బుద్ధుడుండెడి విహారమునకు పోయెను. అంతకు ముందే బుద్ధుడు లేచి, బయలున ధ్యానములో అటునిటు పచారు చేయుచుండెను. ఆ అనాధపిండికుని చూచి సుదత్తా! ఇటురమ్మా అనెను. తన స్వంత పేరుతో పిలిచినందున అనాధపిండికుడు సంతోషమును బొంది బుద్ధునిచేరి వారి పాదములమీదపడి భగవంతుడు సుఖముగా నిద్రించెనా? అని ప్రశ్నించెను. "బంధములు విడిపోయిన అర్హతుడు, కామములు నశించిన అర్హతుడు. కామక్లేశ కర్మములను వదలిన అర్హతుడు, మనశ్శాంతికి అడ్డములైన కష్టములను పగులగొట్టిన అర్హతుడు. పాపరహితుడైన అర్హతుడు. హృదయములోని దాహమును అడచిన అర్హతుడు, శాంతిమధ్యమున స్థిరుడైయుండును. వానికి సుఖముగా నిద్దురపట్టును" అని బుద్ధుడు వానికి జవాబు చెప్పెను. అంతట అనాధపిండికునకు ధర్మబోధచేసి త్యాగముయొక్క మహి

మును వర్ణించి వాని హృదయములో జ్ఞానబీజమును నాటెను. అనాథపిండికునకు సత్యస్వరూపము ప్రత్యక్షమయ్యెను. మబ్బువిచ్చినట్లు అనుమానము తీరిపోయెను. చిత్తము స్థిరపడెను. బుద్ధునియందు అతను శరణు జొచ్చెను. శిష్యుడయ్యెను. మరునాడు భిక్షకు పిలచెను. బుద్ధుడు సమ్మతించెను.

అనాథపిండికునకు రాజగృహానగరము లో స్వంతఇల్లుగాని. ఆస్తిగాని లేదు. అందుచే ఇతని బావమరిదిని తగిన సహాయము చేయుమని అడిగెను. ఆనగర పాలకుడును ఆ మగధరాజును, సహాయము చేతుమనిరి. వీరందరికిని ఆతను కృతజ్ఞతను తెలిపి తన ధనము తోడనే బావమరిది ఇంట విందు నేర్పరచెను. వేళకు బుద్ధుని సంఘమును పిలచెను. వారికి తానే వడ్డించి శ్రద్ధాభక్తులతో భిక్ష పూర్తి చేసెను. అప్పుడు బుద్ధుని సమీపించి వచ్చే చాతుర్మాస్యలు తామును. తమ సంఘమును శ్రావస్తీనగరములో జరుపుడని వేడుకొనెను. "తథాగతులు ఏకాంతవాసమును కోరుదురు." అని బుద్ధుడు పలికెను. "భగవంతుడా! సుఖవంతుడా! నేను గ్రహించితిని." అని అనాథపిండికుడు మనవి చేసెను. అంతట అనాథపిండికుడు రాజగృహానగరములోని పనులు పూర్తి చేసుకొని శ్రావస్తీనగరమునకు వెళ్ళుచు

దోవలోనుండిన చుట్టములకు, స్నేహితులకు, ఎరిగినవారికి బుద్ధదేవుడు అవతరించినాడనియు, ఆయన చాతుర్మాస్యలకు శ్రావస్తీనగరము దయచేయుననియు, ఈ దోవనేప్రయాణము చేయుననియు. తెలిపెను. మధ్యమధ్య సత్రములు కట్టుడనియు, నీడుదులను ఏర్పరచుడనియు, కానుకలను అర్పించుడనియు. వారలను పురికొల్పెను. తన పట్టణము చేరి చుట్టుప్రక్కల శోధించెను. పట్టణమునకు దూరముగాక, దగ్గరయుగాక, రాకపోకలకు అనువయి చూపరులకు తేలికయయి, పగలు జనసమర్దము లేక, రాత్రి భయములేక, గాలి, ఎండయు తగులకుండ ఉండునట్టియు, ప్రదేశము ఏదియని చూచెను. అన్నివిధముల సరిపోవునది ఒక్కవనము కనుబడెను. అది అచ్చటి రాజకుమారుడగు జేతునకు చెందినది. వానివద్దకుబోయి ఈవనమును తనకు అమ్మమని అడిగెను. అది అమ్మదలచినది కాదు. దానిమీద సందులేకుండ ధనము పరచినను. అమ్మను అనెను అట్లు నీవు కోరినధనమును పరచెదను, అని అనాధపిండికుడు చెప్పెను. నేను మాట ఇవ్వలేదేఅని జేతుడనెను. వారిద్దరును తీర్పరులవద్దకు బోయిరి. అనాధపిండికుడు దానిమీద ద్రవ్యము పరచునట్లును, దానిని జేతుడమ్మునట్లును

వారు తీర్మానించిరి. అంత అనాథపిండికుడు ఇం టికి కబురుపంపి బండ్లమీద బంగారునాణెములు తె ప్పించెను. తోటయంతయు పరచిరి. చివరకు వాకిలివద్ద కొంత మేరకు చాలకపోయెను. తిరిగి అనాథపిండికుడు కొరవధనము తెచ్చుటకు బండ్లను యింటికి పంపుచుండెను. జేతుడు ఆశ్చర్యపడి. బండ్లను ఆపి. అమిగిలినచోటును నేనే దానము జే తును. నీవు ఒక గొప్ప కార్యమును తలపెట్టినావు. అని అనాథపిండికునితో చెప్పెను. ఈ జేతుడు ప్రఖ్యాతపురుషుడు. ఈతను బుద్ధునికి శిష్యుడైన మేలు అధికముగా నుండును. అని అనాథపిండి కుడు యోజించి ఆభాగమును జేతుడే దానము చేయునట్లు అంగీకరించెను. దానిపై జేతుడు ఒక దర్వాజాను పెట్టి ముఖమండపము కట్టించెను. ఆ తోటలో నివాస గృహములును, గిడ్డంగులును సభాశాలలును, స్నానపుగదులును. కసరత్తుశాల లును, బావులును, బావులపై పందిళ్ళును, చెరు వులును, నిద్రికు గదులును. మొదలగు అవసర మైన కట్టడములన్నింటిని కట్టించెను.

బుద్ధుడును, బుద్ధ భిక్షువులును దీనిని అంగీ కరించి, కృతజ్ఞతను చూపిరి. ఒకప్పుడు ఒకప్రదేశము లోనుండు భిక్షుసంఘములో కల్లలు ఏర్పడెను. అట్లు

కక్షులు ఏర్పడినప్పుడు ఎట్లుప్రవర్తించవలెనని అనాథ పిండికుడు బుద్ధుని అడిగెను. "ఓగృహస్థూ! ఉభయ కక్షులకును కానుకలనిమ్ము. ఇచ్చి ఉభయుల అభిప్రాయములను వినుము. విని బుద్ధధర్మ ప్రకారము ఎవరి అభిప్రాయముకలదో వారి అభిప్రాయమును. విశ్వాసమును. సిద్ధాంతమును అంగీకరించుము." అని బుద్ధుడు ఆతనికి బోధించెను.

---

## — ♦ ఉ ద య ను ని క థ ♦ —

ఆకాలమునాటి భూతకోటి నంతను అమృతమయమగు తన బోధచే ఆనందమున నోలలాడించి, బుద్ధభగవానుడు దేహయాత్ర చాలించి, నిర్వాణ పదములో నిమగ్నుడయ్యెను. ఆ నాడు వైశాఖ శుద్ధపౌర్ణమి. అదియేమి చిత్రమోగాని, పవిత్ర భారతభూమిని తరింపజేయుటకు మాయాదేవీ గర్భమునుండి వెడలి, తన పాద పద్మములను అవనిపై ఆనించిన శుభముహూర్తము వైశాఖశుద్ధ పూర్ణిమయే. "గృహస్థాశ్రమమున పడిపోవద్దు. భౌతిక భోగములలో

తన్మయము కావద్దు. జన్మజరామరణ దుఃఖముల నుండి మమ్ముద్ధరించుటకు బయలు వెడలి రమ్మ" అనెడి హాహారవములతో హృదయమును కరిగించు ఆర్తుల మొరను ఆలించి, ఆదరించి, త్రిలోకసుందరి అర్ధాంగియగు యశోధరను, రూపురేఖాలావణ్యములలో తన్ను మరపించు తనయుని ముద్దుబిడ్డను రాహులుని, వాడిన ఆకు, పూవు, కాయ, రాలని నిత్యకల్యాణ పరంపరతో నెగడుచుండెడి మహోద్యాన వనమును, చింతాకంత వంత నెరుంగక గగన చుంబితమై, సౌకర్య రాశియైన నిరుపమాన ప్రాసాదమును, అవలీలగా విసర్జించి, మహాత్యాగ మార్గమును మానవలోకమునకు ప్రదర్శించిన ఉత్తమ లగ్నము వైశాఖశుద్ధ పూర్ణిమయే. ఆరుయేండ్లు చేసిన కఠిన తపస్సుచే సుందర శరీరమును కఱగించి, పాదచారియై కాఱడవులను ఒంటరిగా దాటి గయా పుణ్యక్షేత్రమున కాలిడి అశ్వత్థవృక్షచ్ఛాయన మారుడు కల్పించిన దురాకర్షణల నన్నిటిని దూరమొనర్చి, అగ్ని పరీక్షల నన్నిటిలో నెగ్గి మారునే మారించి జ్ఞానసంపన్నుడై బుద్ధుడై లోకోత్తర ధన్యమూర్తి అయిన అసదృశమగు సుదినము వైశాఖశుద్ధ పూర్ణిమయే. ఓ వైశాఖీ! నీ అ

దృష్ట మేమనవచ్చు! నీవు లోకమునకెంత మహోపకార మొనర్చితివి!

ఒకనాడు ఉదయనుడు తనరాణివాసముతో సహా. అడవికిపోయి వేటవిహారము సలిపి. ఒకచోట విశ్రమించుచుండెను. అతని రాణులు అచ్చటి ఆటవిక జనముతో మాటలాడుచుండగా. బుద్ధ భగవానుని శిష్యులు ఆ సమీపములో విశ్రమించుచున్నారని తెలుసుకొనిరి. బుద్ధభగవానునిగూర్చి, వారి బోధనుగూర్చి' అదివరకే వారు వినియున్నందున ఆశిష్యులను దర్శింప వారికి కుతూహలము కలిగెను. రాజాజ్ఞను బడసి బౌద్ధభిక్షువులున్న చోటికి బోయి వారికి ప్రణమిల్లి వారి ఆనతిన ఒకచోట కూర్చుండిరి. బుద్ధ భగవానుని ప్రథమ శిష్యుడగు ఆనందుడు వారికి బౌద్ధ ధర్మమును గూర్చి ఉపదేశించెను. వారందఱు ఎంతో సంతసించి 500 దుస్తులను భిక్షువులకు కానుకగా సమర్పించిరి. అంతట తమ శిబిరమునకు తిరిగివెళ్ళిరి. అచ్చటి విశేషములేమని ఉదయను డడుగగా, జరిగినదంతయు పూసగ్రుచ్చి నటుల చెప్పిరి. కాని ఉదయనునకు సంతోషము కలుగుటకు బదులు కోపము కలిగెను. "మీరేల ఇన్ని విలువగల దుస్తులను ఆ బిచ్చ

గాండ్రికు ఇచ్చితిరి.” అని ఉదయనుడు ప్రశ్నిం చెను. “మీరు ఆ మహాత్ములతో మాటలాడిన యెడల. మీకు విశదమగు”నని రాణులు జవాబి చ్చిరి. అచ్చటికి పోవునటుల ఆయనను ప్రోత్స హించిరి. ఉదయనుడు ఆ విషయమును సమగ్ర ముగా తెలిసికొనుటకై, ఆ భిక్షువులున్నచో టికి పయనమై వెళ్ళెను. వారిని చూడగానే ఆయన మనస్సు మెత్తగిల్లెను. వారి ఆనతిచొప్పున ఉచి తస్థానమున ఆసీనుడై, వారుచేసిన ధర్మబోధను వీనులవిందుగా వినెను. అయినను తనకున్న సందే హములనుగూర్చి వారిని ప్రశ్నింపతలంచి వారి అనుమతిని కోరెను.

ఉదయనుడు:— భిక్షువరేణ్యులారా! మీ బోధచే నా సంశయములన్నియు తీరినవి. కాని గ్రామైకరాత్రిగా సంచారము చే యుచు, భిక్షాటనముచే తృప్తిజెందుచుండు మీరు మహాదేవేరులు మీకర్పించిన వస్త్రముల నెటుల నుపయోగించెదరు?

ఆనందుడు:— ఎవరివస్త్రములు చినిగిపోయి నవో, అట్టి భిక్షువులకు, ఆచినిగిన బట్టలకుబదులు ధరించుటకు వీటిని యిచ్చెదము.

ఉదయనుడు:— ఆచినిగిన గుడ్డలతో నేమి

చేసెదరు.

ఆనందుడు:— వాటితో కిటికీలకు తెరల కట్టించెదము.

ఉదయనుడు:— అదివరకున్న తెరగుడ్డలు ఏమగును?

ఆనందుడు:— వానిని దిండ్ల గలీబులుగా మార్చెదము.

ఉదయనుడు:— ఇదివరకున్న గలీబుగుడ్డల నెట్లు వినియోగించెదరు?

ఆనందుడు:— వానితో పరజాపట్టాలు కుట్టించెదము.

ఉదయనుడు:— పాత పరజాపట్టాలను యెటులవాడెదరు?

ఆనందుడు:— వానితో కాళ్ళు తుడుచుకొనుటకు చిన్న చిన్న తువాలాలు చేసెదము.

ఉదయనుడు:—పాతతువాళ్ళ నేమిచేసెదరు?

ఆనందుడు:— అవి దుమ్ముదులుపు గుడ్డలు అగును.

ఉదయనుడు:— అదివరకు అందుకై వాడే ఆగుడ్డల నేమిచేసెదరు?

ఆనందుడు:— వానిని అలుకుగుడ్డలుగా వాడెదము.

ఉదయనుఁడు:— అదివరకున్న అలుకగుడ్డల నెట్లు మార్తురు?

ఆనందుఁడు:— ఆ అలుకుగుడ్డలను చిన్న చిన్న తుంపులుచేసి మట్టితో కలిపి నేల మెత్తించెదము.

ఉదయనుఁడు ఆమాటలనువిని ఆశ్చర్యము నొందెను. వారిచేతిలో ఏవస్తువు అయినను ఏ విధమునను వృథాగాక, సద్వినియోగమగునని తెలిసికొని సంతసించి వారి పాదుపరితనమునకు మెచ్చుకొని, మరి 500 వస్త్రములను తాను తనవంతు క్రిందఅర్పించెను.

| | | | |
|---|---|---|---|
| ౬౦ | ౧౪ | కోవన్ని | కోనున్న |
| ౬౧ | ౧ | గన్ని | గన్ని |
| ౬౩ | ౨ | ఎవరికి | ఎవరికి |
| — | ౭ | బుద్ధకు | బుద్ధునకు |
| ౬౫ | ౭ | దేవదతుడు | దేవదత్తుడు |
| | ౯ | పాణము | ప్రాణము |
| | ౧౦ | దతునకి | దత్తునికి |
| ౬౮ | ౧౬ | సరిపమైన | సరిప్రైన |
| | ౧౯ | మడొకడు | మరియొకడు |
| | | సప్రైన | సరిప్రైన |
| | ౨౨ | లోపలను | లోపములను |
| ౬౯ | ౩ | నాయకుడనే | నాయకుడనై |
| | ౧౨ | జగె | జరిగె |
| | ౧౩ | దేవదతునికి | దేవదత్తునికి |
| ౭౨ | ౭ | చపునట్లు | చంపునట్లు |
| ౭౩ | ౨౧ | భిక్షువుతో | భిక్షువులతో |
| | ౨౨ | అనభవించు | అనుభవించు |
| ౮౫ | ౧౨ | బుదుడు | బుద్ధుడు |
| ౮౬ | ౩ | దుడు | ద్ధుడు |
| ౮౮ | ౨౦ | బుదుడు | బుద్ధుడు |
| ౯౦ | ౨౧ | స్త్రీలకె | స్త్రీలకై |
| ౯౪ | ౧౬ | సఘమును | సంఘమును |
| — | ౧౯ | సుఖవతుడా | సుఖవంతుడా |
| ౯౬ | ౨౦ | అగీ | అంగి |

# ఆయుర్వేద ఔషధములు

5. నాగరాదికాంపౌండు: పౌను 1కి రు5-0-0

అజీర్ణమును నిర్మూలించును. మలశుద్ధిని కలిగించును. నూతనశక్తిని ప్రసాదించును.

6. బాలసంజీవని మాత్రలు:—100 మాత్రలు రు1-0-0

అనుపానభేదముతో చిన్నబిడ్డల వ్యాధుల నన్నింటిని కుదుర్చును.

7. శిశుకల్ప- 4 ఔన్సులు రు1-4-0

పిల్లలకు బలమును చేకూర్చు ఔషధరాజము

8. చందనాదితైలము. పౌను 1కి రు4-0-0

మెదడును చల్లబరచును. జ్ఞాపకశక్తిని వృద్ధిగావించును. రక్తపుపోటును తగ్గించును.

9. భృంగామలకతైలము: పౌను 1కి రు3-0-0

అభ్యంగనమునకు మంచిది. వెంట్రుకలను పెంచును.

✳ ఇంకా అనేకములగు తైలములు, లేహ్యములు, ఆసవములు, అరిష్టలు, అంజనములు, కజ్జలీ ఔషధములు, గుటికలు, చూర్ణములు. పానకములు, భస్మములు మావద్దదొరకును. 2 అణాలు పంపుచో క్యాటలాగు పంపబడును. వ్యాపారస్తులకు మంచికమీషను యివ్వబడును.

☛ వినయాశ్రమము (వయా) పొన్నూరు, గుంటూరుజిల్లా అని వ్రాయవలెను.

# వినయాశ్రమములో దొరకు
# గ్రంథములు, యితరవస్తువులు

వినయాశ్రమము ౧౯౩౩ డిశంబరు ౨౩ తేదీన స్థాపింపబడినది. దైవ, మానవ, దేశసేవలు ప్రధానాశయములు. 'ఆంధ్రహరిజన్' వారపత్రిక— గాంధీజీ భావాలను, సిద్ధాంతములను వెల్వరించును. సంవత్సరచందా రు ౬-౦-౦ పోస్టేజీతో.

## ఆంధ్రవేదములు

౧. ఋగ్వేద ప్రథమసంపుటము

౨. కృష్ణయజుర్వేదము

౩. సామవేదము

ఒక్కొక్క సంపుటం—ఖాదీఅట్టతో రు ౩-౮-౦

| | |
|---|---|
| ౪. ఖాదీతత్వం | ౦-౮-౦ |
| ౫. త్యాగమహిమ | ౦-౮-౦ |
| ౬. గ్రామపరిశ్రమల నిరూపణం | ౦-౮-౦ |
| ధనుష్తక్లీ—సాదా | ౧-౧౪-౦ |
| ,, మడతది (పాశుపతా) | ౩-౦-౦ |

☞ వినయాశ్రమము (వయా) పొన్నూరు, గుంటూరుజిల్లా అని వ్రాయవలెను.